8.. 1994 శుక్రవారం, 10 పేజీలు, సంపుటి: 65, సంచిక: 27, విడి ప్రతి: రు. 2.00 లు

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు   జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి.



చంద్రబాబునూ అనుమానిస్తూ, అవమానిస్తూ ఎన్టీఆర్ చేసే వింత చేష్టలు తెలుగుదేశాన్ని చిందర వందర చేస్తున్నాయి!

కూర్చున్న కొమ్మను నరుక్కోవడంలో...

# దొందూ దొందే!

ఎమ్మెల్యేలను సస్పెండ్ చేసే మజ్జి వారి చిలిపి చేష్టలు, అసమ్మతిపై కోట్ల వారి కోపతాపాలు కాంగ్రెస్‌ను కల్లోల పరుస్తున్నాయి!

"రాష్ట్రంలో మా కాంగ్రెసోళ్లు కుమ్ములాడు కుంటూ అధికారాన్ని ఎప్పుడు తెలుగు దేశానికి అప్పగిద్దామా అని ఆరాట పడ్తుంటే - వాళ్లేమో 'మా కొద్దు బాబు అధికారం' అంటూ మా కంటే ఎక్కువగా కొట్లాడుకుంటున్నారు"

పిసిసి అధ్యక్షుడు మజ్జి తులసిదాసోపాఖ్యానం ఇది. మజ్జి వారు తెలిసి అన్నారో, తెలీక అన్నారో గాని ప్రస్తుతం రాష్ట్రంలో అధికార కాంగ్రెస్, ప్రతి పక్షియం తెలుగు దేశం పార్టీల వాస్తవ పరిస్థితికి ఈ వ్యాఖ్య అద్దం పడుతోంది. గత నెలరోజుల పరిణామాలు పరిశీలిస్తే అటు కాంగ్రెస్ ఇటు తెలుగు దేశం ఒకరి వేగాన్ని మించి మరొకరుగా తాము కూర్చున్న కొమ్మను నరుక్కుంటున్నారు. 'దేశం' ఫైర్ బ్రాండ్ రేణుకా చౌదరి తెలుగుదేశం అధ్యక్షుడ్ని, ఆయన ముద్దుల భార్యను తూలనాడినందుకు పార్టీ నుంచి గెంటి వేయబడింది. ఈ సంఘటన జరిగిన వారం రోజుల్లోనే కాంగ్రెస్ ఎమ్మెల్యే నర్సిరెడ్డిని పిసిసి అధ్యక్షుడు మజ్జి పార్టీ నుంచి సస్పెండ్ చేశారు. మజ్జి గుంటూరు జిల్లా పర్యటనలో నర్సిరెడ్డి ప్రత్యర్థి నాగలక్ష్మితో 'సన్నిహితంగా' మెలగిన కారణంగా కడుపు మండి నర్సిరెడ్డి పిసిసి అధ్యక్షుడిపై తన జబ్బ బలం చూపాడు. ఈ రెండు సంఘటనలకు కూడా క్రమశిక్షణా రాహిత్యమే ప్రధాన కారణం. కాగా రేణుక గెంటివేత తర్వాత తెలుగు దేశంలో ముఠా సంస్కృతి బాగా బలపడింది. గతంలో ఎన్టీఆర్‌తో పాటు ఆయన అల్లుళ్లకు గ్రూపులుండేవి. ఇప్పుడు కొత్తగా లక్ష్మీపార్వతి కట్ట కూడా తయారైంది. దీనితో అల్లుళ్ల ఉనికికి ప్రమాదం ఏర్పడింది. ముఖ్యంగా చిన్నల్లుడు చంద్రబాబు నాయుడు పరిస్థితి దైన్యంగా వున్నది. రేణుక విషయంలో చివరి నిముషందాకా రాజీకి పాకులాడినందుకు 'బాబు' పై ఎన్టీఆర్ కస్సుబుస్సు మంటున్నాడు. రేణుకను తొలగించిన దానికి చిన్నబుచ్చుకున్న చంద్రబాబు అలిగి నాలుగు రోజులపాటు రాజధాని వదలి వెళ్లి పోయాడు. చంద్రబాబును సమర్థించే ఎమ్మెల్యేలు కూడా ముఖం చాటేయడంతో ఎన్టీఆర్ కళ్లెర చేశాడు. దానితో బిలబిల మంటూ చిన్నల్లుడూ, ఆయన ఎమ్మెల్యేలు ఎన్టీఆర్ చేస్తున్న శరణు జొచ్చారు. అయితే ఎన్టీఆర్ అవమానాల్ని భరిస్తూ బతికే కంటే 'ఏదో ఒకటి' చేయాలన్న తలంపు వారిలో బలంగా నాటుక పోయింది. ఆ ముహూర్తం కోసం ఎదురుచూస్తూ చిన్నల్లుడు అండ్‌కో ప్రస్తుతం పార్టీలో సహాయ నిరాకరణలో వున్నారు.

కాగా రేణుక ఇప్పుడు బజారులో పడతానంటూ తిరుగుతున్నది. గతంలో నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి మాదిరిగా ఎన్టీఆర్ వ్యతిరేక సభలు పెట్టి దుమ్ము దులుపు తానంటున్నది. ఎన్నికలు సమీపిస్తున్న సమయంలో రేణుక వ్యవహారం తెలుగు దేశానికి కాస్తో కూస్తో కీడు చేస్తుందనడంలో సందేహం లేదు.

కాగా నర్సిరెడ్డి సస్పెన్షన్ విషయంలో తులసీదాస్ కాస్తంత తొందర పడ్డాడు. మామూలుగా అయితే ఎమ్మెల్యేలపై క్రమశిక్షణా చర్యలు సిఎల్‌పి నాయకుడు (ముఖ్యమంత్రి) తీసుకోవాలి. కానీ భావావేశ పూరితుడై మజ్జి ముఖ్యమంత్రికి చెప్పకుండానే

కొరవ 6వ పేజీలో

# అన్నీ వుండడమే అమెరికన్ల సమస్య!

రోటరీ ఇంటర్నేషనల్ డిస్ట్రిక్ట్ (ఆంధ్ర, కర్నాటక) నుంచి గ్రూప్ స్టడీ ఎక్స్‌ఛేంజ్ ప్రోగ్రాం క్రింద అమెరికా సంయుక్త రాష్ట్రాలలో, ఆగ్నేయ భాగంలో, మెక్సికో సింధు శాఖను అంటిపెట్టుకొని దక్షిణంగా ఉన్న లాయిసియానా రాష్ట్రంలో పర్యటించి ఉపన్యసించడానికిగా నలుగురిని ఎంపిక చేశారు. వారిలో నేను ఒకడిని. మిగిలిన ముగ్గురూ, వరుసగా డాక్టర్ కె. నాగరాజ రావు, యం.డి. ప్రొఫెసర్ ఆఫ్ సైకియాట్రీ, దావణగెరె కన్నడిగులు; వైద్యనాథన్ రంజిత్, బి.ఇ., నెలక్యాస్ట్ లిమిటెడ్ మార్కెటింగ్ మేనేజరు, మద్రాసు, తమిళులు; పి.ఆర్. కృష్ణకుమార్, ఎం.ఎ. సీనియర్ మేనేజర్, స్టేట్‌బ్యాంక్, పుట్టపర్తి,కేరళీయులు;మేము నలుగురం

> అంత ఆధునికతలోనూ సాంప్రదాయత కనుమరుగు కాలేదు; అతిథులంటే వారికెంత గౌరవమో!

రోటరీ సభ్యులం కాము. గూడూరు నివాసి, రోటరీ సభ్యుడు, రాజకీయ నాయకుడు, అభ్యుదయ రైతు అయిన యల్లసిరి గోపాలరెడ్డి నాయకత్వంలో మా ఈ పర్యటన ఏప్రెల్ 9 నుంచి మే 9 వరకు సాగింది. ఈ పర్యటన ఏర్పాటు చేయడంలో డిస్ట్రిక్ట్ గవర్నర్ శ్రీ రొడ్ల భాస్కర రెడ్డి (ప్రముఖ మైకా వ్యాపారస్తులు, గూడూరు) కృషి,

> భార్యభర్తలు కలిసి వున్నా, పిల్లలు వేరై పోతున్నారు!

సహకారం చాలా ఉండినాయి.

ఈ పర్యటన మాకు అరుదైన అవకాశం. భారతీయులు అమెరికాకు వెళ్ళడం సాధారణమైపోయిన ఈ దినాల్లో అరుదైన అవకాశం అని ఎందుకంటున్నానంటే, మాలో ప్రతి ఒక్కరూ, వేర్వేరుగా పది, పన్నెండు అమెరికన్ కుటుంబాలతో, రెండు మూడు భారతీయ కుటుంబాలతో వారి ఇళ్లలో అతిథులుగా ఉండటం జరిగింది. అక్కడ పర్యాటకులకు ప్రత్యేక అనుమతి ఉంటేనే గాని ప్రవేశం లేని, దర్శించ దానికి వీలు కాని కొన్ని ప్రదేశాలు, స్థలాలు, జనరల్ మోటార్స్ అసెంబ్లీ ప్లాంట్ వంటి కొన్ని పారిశ్రామిక సంస్థలు, కొన్ని పెద్ద హాస్పిటళ్లు, జైళ్లు, వ్యవసాయ క్షేత్రాలు, కొన్ని విశ్వవిద్యాలయాలు, నీగ్రోలు నివసించే పేటలు, తదితరాలు మేము చూడగలిగాము. అందువల్ల అమెరికన్ల కుటుంబ, సాంఘిక, ఆర్థిక జీవనాన్ని కొంత దగ్గరగా పరిశీలించటానికి మాకు వసతి ఏర్పడింది. రోటరీ ఇంటర్నేషనల్ తరఫున పర్యటించిన లాయిసియనా రాష్ట్రం గాక, నా సొంత ఖర్చుతో ఇరుగు పొరుగు రాష్ట్రాలలోని కొన్ని దర్శనీయ స్థలాలు కూడా చూచాను. ఉదా: ఫ్లోరిడా రాష్ట్రంలోని వాల్ట్ డిస్నీ వండర్ లాండ్ మొదలైనవి. భారత దేశానికి తిరిగి వస్తూ దారిలో దుబాయ్ నగరం, క్రికెట్ క్రీడలకు పేరు గాంచిన షార్జా నగరం చూచాను. నా పర్యటనలో 15 రోటరీ క్లబ్బులను, మూడు విశ్వవిద్యాలయాల చరిత్ర శాఖలను ఉద్దేశించి భారతీయ చరిత్ర, సంస్కృతులపై ఉపన్యసించాను. భారత, అమెరికా సంబంధాలు గురించి మాట్లాడాను. నేను అమెరికన్ల జీవన విధానాన్ని గురించి ప్రత్యేకంగా గమనించిన కొన్ని విషయాలను మాత్రమే ఈ క్రింద క్లుప్తంగా ముచ్చటిస్తాను.

నేను పర్యటించిన లూయిసియానా రాష్ట్రం, వ్యావసాయక రాష్ట్రం. వైశాల్యంలో దాదాపు ఆంధ్రప్రదేశ్‌లో సగం ఉంటుంది (4, 45, 520 చ.మై.) 1990 సెన్సస్ ప్రకారం జనాభా 4,238,216. ఆంధ్రప్రదేశ్‌లో చదరపు మైలుకు జనసాంద్రత సరాసరి 700 అయితే,



డిస్నీల్యాండ్‌లో ఒక ఆకర్షణీయ ప్రదర్శన ప్రాంగణం ఎదుట ఈ వ్యాస డాక్టర్ సివి రామచంద్రరావు; గూడూరు, ఎల్లసిరి గోపాల రెడ్డి

లూయిసియానాలో చ.మైలుకు 100 కన్నా తక్కువ. మన గోదావరి డెల్టా మాదిరి, లాయిసియానా. మిసిసిపీ నది

> చీపురుకట్ట సైతం బహుమతికి అర్హమైనదే!

నీళ్ల చేత సంపన్నమైన డెల్టా ప్రాంతం. శీతోష్ణ పరిస్థితులు దాదాపు ఆంధ్రప్రదేశంలో వలెనే ఉంటాయి. ఆంధ్రదేశ్‌లో వలెనే, లూయిసియానా రైతులు వరి, చెరకు, పొగాకు, పత్తి పండిస్తారు. పెద్ద యెత్తున సాగు చేసే మరొక పంట సోయాబీన్. ఈ వివరాలు ఇక్కడ ఇవ్వడానికి కారణం వ్యావసాయిక ఆర్థిక జీవన విధానం ఉన్న చోట, సామాన్యంగా ప్రజలు తమ జీవన విధానంలో పాత సాంప్రదాయాలను గౌరవిస్తుంటారు. యు.ఎస్.ఎ. లో వర్జీనియా రాష్ట్రానికి ఉత్తరంగా ఉండి, పారిశ్రామికంగా మిక్కిలి ప్రగతి సాధించిన ఉత్తర రాష్ట్రాలతో పోల్చినప్పుడు- వర్జీనియాకు దక్షిణంగా ఉన్న రాష్ట్రాలలో ప్రజల జీవన సరళి సంప్రదాయ బద్ధంగా, విభిన్నంగా ఉంటుంది. లూయిసియానా ప్రజలలో ఎక్కువ మంది, చాలా వరకు సంప్రదాయ బద్ధమైన జీవితాన్ని గడుపుతున్నారని చెప్ప వలసి వుంటుంది.

అమెరికన్ కుటుంబ వ్యవస్థను గూర్చి మనలో కొందరికి కొన్ని అపోహలు ఉన్నాయి. అమెరికన్ కుటుంబ వ్యవస్థ భగ్నమయి పోయిందనీ, అక్కడ భార్యభర్తలు తరచూ విడాకులు తీసుకుంటారనీ, స్త్రీ పురుష సంబంధాలలో విచ్చలవిడితనం ఉంటుందని అందరి అపోహలు. ఇట్టి అపోహలు నాకూ ఉండినాయి. నేను అతిథిగా ఉన్న పన్నెండు అమెరికన్ కుటుంబాలలోని భార్యభర్తలు వెనుక తరానికి చెంది, నలభై ఏండ్లనుంచి డెబ్బై ఏండ్లలోపు వయసు గలవారు. వీరందరూ, భారతీయ దంపతులకన్నా ఎక్కువ అన్యోన్యమైన ప్రేమాస్పదమైన వైవాహిక జీవితాన్ని గత మూడు నాలుగు దశాబ్దాలుగా గడుపుతున్నారు. వీరందరూ దైవభక్తి పరులైన క్రిస్టియన్లు; క్రిస్టియానిటీలో వివిధ శాఖలకు చెందినవారు ; కాని ప్రతి ఇంటిలో భార్య, భర్త తప్ప వారి పిల్లలెవ్వరూ ఇరవై ఏండ్లకు పైబడ్డవారు వారితో ఉండరు. ఇరుగు, పొరుగుతో కూడా ఎక్కువ సంబంధాలు వుండవు. నిరంతరం ఉద్యోగరీత్యా, వృత్తిరీత్యా నడక అనేది మరచి, కార్లలో పరుగులు తీస్తుంటారు. ప్రతి ఇంటికి కనీసం రెండు కార్లైనా వుంటాయి. వారికి ఇరుగు పొరుగువారితో తాపీగా మాట్లాడడానికి, సంబంధాలు పెట్టుకోవడానికి కాలం చాలదు. రోడ్లమీద ఎంత దూరం పోయినా నడిచే మనిషి కనబడడు. వాళ్లకు కాళ్లు ఉన్న సంగతి అమెరికన్లు మరచిపోయారు. వాళ్లు కాళ్లు ఉపయోగించేది జాగింగ్ రన్నింగ్ వంటి ప్రత్యేక వ్యాయామాలకు మాత్రమే. అందుకనే AMERICANS LIVE IN THEIR CARS అని ఒక సామెత ఏర్పడింది.

నాకు ఆతిథ్యమిచ్చిన అమెరికన్ గృహస్థులు అందరూ అప్పర్ మిడిల్‌క్లాసుకు చెందినవాళ్లు. నెలకు వెయ్యి డాలర్ల (రు.32,000దాదాపు)కు తక్కువ ఆదాయం వచ్చేవారు బీదవారి కింద లెక్క; 1000 నుంచి 3000 డాలర్ల వరకు ఆదాయం కలవారు లోయర్ మిడిల్‌క్లాసు ; 3000 నుంచి 6000 వరకు ఆదాయం గలవారు మిడిల్ మిడిల్‌క్లాసు ; అంతకుమించి పదివేల వరకు ఆదాయం కలవారు అప్పర్

> కాళ్లుండేది నడవడానికని ఎప్పుడో మర్చిపోయినట్లున్నారు!

మిడిల్‌క్లాస్‌గా పరిగణిస్తారని ఒక అమెరికన్ గృహస్థు తెలిపారు. అమెరికన్ మిడిల్ క్లాస్ ఇళ్లన్నీ ఒకే తీరుగా ఉంటాయి. ఒక లివింగ్ రూం (మన డ్రాయింగ్ రూం లేక హాలు). దానిని అనుకొని కిచెన్, వీటికి ముందు వాకిట్లో గ్యారేజ్, ఇంటి వెనుక భాగంలో ఆర్థిక స్తోమతను బట్టి 2, 3 లేక 4 పడక గదులు. ఏ ఇంటికిగాని కనీసం వంద అంకణాలకు తక్కువగాని బ్యాక్‌యార్డు; ఇంటి ముందర ఒక చిన్న లాన్; ఇళ్లన్నీ

> నెలకు 30 వేల ఆదాయం వుంటే పేదవాడి క్రింద లెక్క వేస్తారు!

ఒకటి లేదా రెండు అంతస్తులు మాత్రమే. కొంతమంది తమ ఇళ్లను పదినుంచి ముప్పై ఎకరాల స్థలంలో, ఊరికి కొద్ది వెలుపలగా నిర్మించారు. కొంత సంపన్నమైన ఇళ్లలో స్విమ్మింగ్‌పూల్ ఉంటుంది. అక్కడి భారతీయులు కూడా ఇదే పద్ధతిలో, వారి ఆర్థిక స్తోమతను బట్టి, ఇళ్లు నిర్మించుకొని ఉన్నారు. లూయిసియానా రాష్ట్రంలో ఏ కొద్ది నగరాలలోనో తప్ప

కొరవ 8వ పేజీలో

# ఇంత బలవంతమా?

కాపులను వెనుకబడిన తరగతుల జాబితాలో చేర్చడానికి సమ్మతిస్తూ రాష్ట్ర ప్రభుత్వం స్పష్టమైన హామీ ఇచ్చింది. మాజీ మంత్రి శ్రీ ముద్రగడ పద్మనాభం ఆమరణ నిరాహార దీక్ష ఫలితంగా ఏర్పడిన అరాజక పరిస్థితులను అదుపు చేయలేని నిస్సహాయతతో; ఎన్నికల సమయంలో ఒక వర్గం ప్రజలు దూరమై పోతే అధికారం చేజారి పోతుందేమోనన్న రాజకీయ స్వార్థంతో విజయ భాస్కర రెడ్డి ప్రభుత్వం ఈ నిర్ణయం తీసుకున్నది.

మొండి పట్టుదల, మంకు తనంతో ముద్రగడ పద్మనాభం ప్రభుత్వ మెడలు వంచి, తాననుకున్నది సాధించారు. ఇది ఆయన ప్రతిష్ఠను పెంచే విజయం. రాష్ట్రంలో తిరుగులేని కాపు నాయకుడుగా శ్రీ పద్మనాభం గుర్తింప బడతారు. ఆయన రాజకీయావకాశాలను దెబ్బ తీయడానికి, మంత్రి పదవుల వంటివి నిరాకరించడానికి భవిష్యత్ కాంగ్రెస్ ముఖ్యమంత్రులు ఒకటికి రెండు సార్లు ఆలోచించ వలసి వుంటుంది.

అయితే ఒక్క [illegible] విరసింపులకు, బలవంతా[illegible] లొంగి మొత్తం రాష్ట్ర రాజకీయ, సామాజిక వాతావరణాన్ని ప్రభావితం చేసే నిర్ణయం తీసుకోవడం సమంజసమా? కాపులను బిసిల జాబితాలో చేర్చాలన్న కోరిక చాలా పాతది. శాసన సభ ఎన్నికలు దగ్గర పడినప్పుడల్లా ఉవ్వెత్తున లేస్తుంటుంది; ఆ తర్వాత తాటాకు మంట వలె చల్లారి పోతుంటుంది. ఎన్నికలకు ముందు ఓటర్లను ఆకర్షించడానికి, ఆ తర్వాత మంత్రి పదవులలో వాటా పొందడానికి కాపునాయకులు ఈ సమస్యను వాడుకుంటూ వచ్చారింత కాలం. ఇప్పుడు పద్మనాభం పంతం వల్ల ఇదింత దూరం వచ్చింది. కాపులలో ఆర్థికంగా వెనుకబడిన వారు చాలా అధిక సంఖ్యలోనే వున్న మాట వాస్తవం. వారికి విద్యా, ఉపాధి అవకాశాలు మెరుగు పరచడానికి రిజర్వేషన్ల ద్వారా కొంత ప్రాధాన్యత ఇవ్వడమూ సమంజసమే! అయితే దానికి ఒక పద్ధతి, చట్ట సమ్మత విధానం అవసరం లేదా? రాష్ట్రంలో వివిధ కులాల ఆర్థిక, సామాజిక స్థితిగతులను అధ్యయనం చేసి, ఏ ఏ కులం ఏఏ వర్గంలో బిసి జాబితాలో చేర్చడానికి అర్హమైవుంటే [illegible] కమిషన్ నియామకమై వుండి [illegible] నివేదిక వెలువడే వరకు ఓపిక అప్పుడాగా తమకు అన్యాయం జరిగితే ఆందోళన చేయడం సమంజసం. నిజానికి అగ్రవర్ణాలుగా భావింపబడే కమ్మ, రెడ్డి, బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ కులాలతో కాపులుసామాజికంగా, రాజకీయంగా సమస్థాయిలో వున్నారనే చెప్పాలి. శాసన సభలో, పార్లమెంట్‌లో, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలలో వారికి మంచివాటా లభిస్తున్నది. గుమాస్తాల నుంచి ఐఏఎస్, ఐపిఎస్ అధికార్ల వరకు ప్రభుత్వ యంత్రాంగంలో వారు కీలక పాత్ర వహిస్తున్నారు. వ్యాపార, వాణిజ్య, పారిశ్రామిక రంగాలలోని వారు ఎంతో ముందు వున్నారు. కాపులలో ఆర్థికంగా చితికి పోయిన వారు లేరా అంటే- ఇతర అగ్రవర్ణాలలోనూ తిండికి గతిలేని వారు లేరని చెప్పగలమా? ఆమాటకొస్తే యాదవులు, నాయీ బ్రాహ్మణులు, రజకులు, కంసాలులు, వడ్డెరలు వంటివారు బిసిలుగా పరిగణింప బడుతున్నప్పటికీ ఆర్థికంగా, రాజకీయంగా ఏదైనా లబ్ధి పొందుతున్నారా? తమనిప్పుడు ఎస్‌సి, ఎస్‌టిల జాబితాలో చేర్చమని వారు ఆందోళన చేస్తే ప్రభుత్వం సమ్మతిస్తుందా? అగ్రవర్ణాలుగా గుర్తింప బడుతూ అతిహీన స్థితిలో బ్రతుకుతున్న కులాల వారు ఇంకెందరు లేరు రాష్ట్రంలో? వారూ ఆత్మాహుతులకు, ఆమరణ దీక్షలకు పూనుకొంటే ప్రభుత్వం వారిని బిసిలలో చేరుస్తుందా?

బిసి జాబితాలో కొత్తగా కులాలను చేర్చినందు వల్ల ఆయా కులాల ప్రజలకు నిజమైన ప్రయోజనం జరుగుతుందని ఎవరైనా చెప్పగలరా? రిజర్వేషన్లమొత్తం శాతం 50 కి మించడానికి వీలని సుప్రీంకోర్టు ఎప్పుడో తీర్పు చెప్పివుంది. ఇప్పుడున్న బిసిలకే విద్యా, ఉపాధి అవకాశాలు సాము మాత్రంగా వున్నాయి. కొత్తగా చేరేవారు వారితో పోటీ పడితే అవి మరింత కుదించుక పోతాయి.

ఈ సమస్యలన్నీ కాపు నాయకులకు, పద్మనాభం గారికి తెలియవని భావించలేము. కాని, వారి రాజకీయావసరానికి ఈ సున్నితమైన సమస్య మంచి సాధనంగా వుపకరించింది. పద్మనాభం గారు వ్యక్తి గతంగా ఆదర్శ ప్రాయమైన వారు. నీతి నిజాయితీలతో పాటు, ఆత్మ గౌరవానికి ఏమాత్రం భంగకరమని భావించినా పదవులను తృణప్రాయంగా వదిలేయ గల్గిన త్యాగబుద్ధి ఆయనలో వుంది. అటువంటి ఆదర్శప్రాయ నాయకుడు కులపరమైన సమస్యను రాజకీయం చేసి, పోరాటం జరపడం విచారకరం. [illegible] రాష్ట్రంలో, దేశంలో కులాలు, మతాల [illegible] చీలికలు, స్పర్థలు పెరిగి సామాజిక వాతావరణం కలుషితమై వుంది. అన్నదమ్ముల వలె మెలగాల్సిన ప్రజల మధ్య అది శత్రుభావాలు రెచ్చగొడుతున్నది. పద్మనాభం ఉద్యమం వల్ల ఆ ద్వేష భావం మరింత పెరిగే ప్రమాదం వుంది. ప్రశాంతతకు, పచ్చదనానికి ప్రతీక అయిన కోనసీమ కూడలి నగరం- అమలాపురంలో కులవరమైన దావాగ్ని రగుల్కొని కర్ఫ్యూ [illegible] విధించింది. ఇతర ప్రాంతాలలో అంత రచ్చలు లేనప్పటికీ, విద్వేష భావాలు [illegible] రాజకీయవాదుల కుత్సిత [illegible] పోరాటానికి ప్రజలు సమిధలు కావడం మన దేశపు దౌర్భాగ్యం! పద్మనాభం గారు ఇప్పటికైనా కుల నినాదాలు వదలి, ప్రజా సమస్యలపై తన ఆందోళనలు, ఉద్యమాలు నిర్వహిస్తే సర్వజనా మోదమైన నాయకుడుగా గుర్తింపబడుతారు.

జమీన్‌రైతు

# బిసిల గుర్తింపుకు ఇంకా నివేదికలు కావాలా?

అన్నం వుడికిందో లేదో తెల్సుకోవడానికి అన్నమంతా పట్టి చూడనక్కరలేదు. వెనుకబడ్డ కులాల వారిని వెనుక బడ్డ కులాల జాబితాలో చేర్చను రాష్ట్రమంతా చుట్టి చూడాలా? ప్రజలకు అవసర సౌకర్యాల కల్పనలో జాప్యం జరిగితే ఏమీ మునిగి పోదు; కాని ఆపదలో వున్నవారికి ప్రాథమిక సహాయం అందించడంలో ఆలస్యం చేస్తే, ఆ ప్రభుత్వం విఫలమైనట్లే లెక్క. 47 ఏళ్ల స్వపరిపాలనా కాలంలో బాగు పడిందెవరు? త్యాగాలు చేసిందెవరు? భోగ భాగ్యాలను మస్తుగా అనుభవిస్తున్నదెవరు? సంపద సృష్టికర్తలైన పనోళ్లందరూ వారి కనీసావసరాలు తీరక అల్లాడు తున్నారు. సోమరి పోతులు స్వర్గ సుఖాలను అనుభవిస్తున్నారు. మన రాష్ట్రంలో వెనుకబడిన కులాలు, తరగతులను, వారి స్థితి గతులను తెలుసు కోవడానికి దగ్గరి దారి ఒకటుంది. నేడు మన రాష్ట్రంలో వున్న అన్ని కీలక పదవులు, వుద్యోగాల్లో వున్నవారి కులాలను పరిగణనకు తీసుకుంటే అవి దక్కని కులాల వారందరూ నిస్సందేహంగా వెనుక బడ్డోళ్ల క్రిందే లెక్క. వెనుక బడిన తనం అనేది దేశాన్ని ప్రమాదం లోనికి తోసేసే రోగం. రోగం ముదిరితే

జనవాణి

నసెమిరా అది మందులకు లొంగదు. నివేదిక తయారీ మిషతో ఇంకా నిరీక్షణా? ఇంకా ఎన్నాళ్లు? ఎన్నేళ్లు?!

గూడూరు -పి.వి.ప్రభాకరరావు.

## కమీషనర్‌కు కృతజ్ఞతలు

నెల్లూరు టౌన్‌కు దూరంగా వుండే చంద్ర మౌళినగర్ ప్రాంతీయులు గత పది సంవత్సరాలుగా నీటికి పడరాని పాట్లు పడుతున్నారు. ఈ ప్రాంతం అసెంబ్లీ ఎన్నికల్లో రాపూరు నియోజక వర్గంలో చేరుతుంది. అందువల్ల ఎవరూ ఈ ప్రాంతం అభివృద్ధి విషయమై పట్టించుకోలేదు. ఈ దశలో మేమంతా మునిసిపల్ కమీషనర్‌ను కలసుకొని పరిస్థితిని విన్న వించగానే యుద్ధ ప్రాతి పదికన మంచినీటి కొళాయిలు వేయించినందుకు కృతజ్ఞతలు. అదేవిధంగా మురికి కూపంగా తయారై వున్న ఈ ప్రాంతంలో డ్రైనేజిలు కూడా నిర్మించి పుణ్యం కట్టుకోమని మనవి.

నెల్లూరు-చంద్రమౌళినగర్ వాసులు.

## ఆక్రమణల తొలగింపుతో ఆనందం

బెమ్సగార్డన్ లోని పర్శపాపులను వారే ప్రవేశానికి

కరప 7వ పేజీలో

7-7-1944

పేజీలు : 6 వెల : 0-1-6

## పల్లెటూళ్లు

### సోమరాజా పల్లె

2తేది పౌర్ణచంద్రుని జన్మదినోత్సవం. పాదపూజలు, హరికథలు, నిప్పుల గుండాలతోటి జండూమృతంగా జరిగింది. కాని అదినం కాసేపు నోరువిప్పి ముత్యాల పల్కులు పల్కుతారని ప్రకటించారు. అట్లాచేయలేదు. ఇదివరకు కొత్తపాళెం లింగుంటపాడులలో జరిగినపుడు గూడ కాసేపు మౌనము మాని మాట్లాడుతారని అన్నారు. అప్పుడూ జరగలేదు. అందువల్ల వీరు పుట్టుకతోనే మౌని చంద్రులాని శంకగానున్నది.

-ఒక భగుతుడు.

### గూడూరు

తాలూకాఫీసులోని జననమరణ రిజిస్టరుకు ఎక్కడనుండి లెక్కలు పోయినా అత్తిపత్తికు (Touch me

జమీన్‌రైతు

not) మాదిరి ముడుచుక పోతున్నది. అసలు ఆ రిజిష్టరు తాసీలుదారుతో పనిలేకుండానే తాకీదులు పంపడం జుల్మానాలు వేయడం గూడా వేస్తున్నదట. అట్లయితే తాసీలు దారుకు పని తగ్గించి సాయపడడం మంచిదే గదా!

-ఒకరకం మునసబు.

### నేరేడు పల్లె

మావూరి రామదేవాలయం పది సంవత్సరాల నుండి పాడుపడియున్నది. పేష్కారుగారు వచ్చి చూచిపొయ్యారు. దేవాలయముమీద పేష్కారు గారికి దయగలిగితే దేవునికి పేష్కారుమీద దయ గలుగుతుందని మాకు నమ్మకం.

-ఎకడు.

### జోషిముఠా నాటకాలు

### జోషిముఠా గంగమ్మ జాతర

ఇవేనా హస్తోదకాలు

"చేసేవి శివపూజలు దూరేవి దొమ్మరిగుడిసెలు" అన్నట్లు ఐక్యతావారము అను మిషతో ఖాతర్ ముఠాభయ్యాలు వూళ్లో వసూలు చేసిన డబ్బంతా కాసీ హోటలు బిల్లులకు జమకట్టేశారు. ఇలాంటి బేకూఫ్ ముఠాతో కలసివుండటం ప్రజాసేవా భిలాషులకు తగదని, గౌరవహీనమని ఆలస్యంగానైనా యినాటికి గుర్తించి ఆ ముఠా యువజనసంఘ అధ్యక్ష పదవికి, లైబ్రరీ కార్యదర్శి పదవికి బ్రాహ్మణ కోడూరు యువకుడు నేరి కోటేశ్వరరావు హస్తోదకాలొదిశారు.

-మన విలేఖరి.

* * *

### 50 ఏళ్ళ క్రితం ఈవారం

### నెల్లూరు ముచ్చట్లు

### నాలుగు సంతోషవార్తలు

ఈ వారంలో విద్యా విషయకమైన సంతోషవార్తలు నాల్గు:

1. రాజాగారి ఫస్టుగ్రేడు కాలేజీ యీ దినం ఓపెన్ గావటం.
2. కస్తూరిదేవి బాలికా హైస్కూలు 16తేదీ ప్రారంభం కానుండుటం.
3. అల్లూరులో హైస్కూలు కావడం.
4. ఎవరూ అనుకోని గొప్ప విషయం: శ్రీ దువ్వూరు నారాయణరెడ్డి గారు స్త్రీల కళాశాలను స్థాపిస్తారని వినడం.

### గ్లూకోస్

1తేదిన స్టాకు వచ్చిందట. 4గురు వర్తకుల కిచ్చారు కంట్రోలు రేటు కమ్మమని. కాని అప్పుడే యెవర్నడిగినా అల్లా అదే పదం 'స్టాక్' అయిపోయిందని.

కరప 8వ పేజీలో



ప్రధాని జన్మదినం సందర్భంగా నెల్లూరు పెద్దాస్పత్రిలో రక్తదానం, దర్గామిట్టలోని విశ్వభారతి అంధుల పాఠశాల విద్యార్థులకు అన్నదానం చేస్తున్న పివి శివ్యపరమాణువు పెళ్లకూరు వసంత కుమార్ రెడ్డి

# రంగడికి 40 లక్షల నిధి!

నెల్లూరు, రంగనాథస్వామి దశ తిరిగింది. శయన నారాయణుడైన ఆయనకు ఇప్పుడిప్పుడే నిద్రమెంచి మెలకువ వస్తున్నట్లుంది. వందలాది ఎకరాల ఆస్తిపాస్తులుండి కూడా నిత్య నైవేద్యాలకు నిధుల లోటుతో పేదరికంతో కాలం గడుపుతుండిన రంగడికి ఇప్పుడు తొలిసారిగా 40 లక్షల నిధి ఏర్పడింది. పాదనాథపురం అమోని, రేముడికుండిన 4ఎరాలా 78 సెంట్ల భూమి వేలం వేస్తే, 37 లక్షల 88వేల రూపాయలకు పాడుకొన్నారు. ఆ బిట్‌లోనే మరొక 3 లక్షలు విలువ చేసే ఖాళీ స్థలం ఇంకా మిగిలివుంది. రంగడి ఆస్తులను కౌలుదార్ల నుంచి విడిపించి, అమ్మడంనదే ప్రథమం. ధర్మకర్తలమండలి ప్రయత్నాలు ఫలిస్తే, టౌన్‌లోని ఇతర ఆస్తుల అమ్మకం ద్వారా ఈ ఏడాదిలోనే మరొక రెండున్నర కోటి రూపాయల నిధి జమ కూడే అవకాశం వుంది. అంత డబ్బు గల్లా పెట్టెల చేరితే తల్పగిరి రంగనాథుడు ఎంత వెలిగి పోతాడో వూహించగలమా?

దేవాదాయ శాఖ డిప్యూటీ కమీషనర్ శ్రీ కెవి కేశవులు, ఇటి శ్రీ నరసింహాచారి, ధర్మకర్తలమండలి సభ్యులు శ్రీ ఉతతా వెంగబ్రాళ్ళ 6,7 తేదులలో ఈ వేలం పాట నిర్వహించారు.

### వాకర్స్ అసోసియేషన్

ఉదయం, సాయంత్రం పూట ఒళ్లు తగ్గించుకొని, ఆరోగ్యం పెంచుకొను వాకింగ్ చేస్తుండే వారంతా ఇటీవల ఎ.సి.సుబ్బారెడ్డి స్టేడియంలో సమావేశమయ్యారు. తమకో సంఘం వుండాలని తీర్మానించుకొని కార్యవర్గాన్ని ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. అధ్యక్షునిగా పంచాయతీరాజ్ శాఖ ఎస్.ఇ., ఇంజనీరు బి. వెంకయ్యను, కాంట్రాక్టర్ బి. ఉమామహేశ్వరరెడ్డిని వర్కింగ్ అధ్యక్షునిగా వి.అరుణాచలంను కార్యదర్శిగా కె. శ్రీనివాసులురెడ్డిని, సహా కార్యదర్శిగా దంతవైద్యుడు కొండారెడ్డిని కోశాధికారిగా ఎన్నుకున్నారు. వీరేగాక

## నెల్లూరు సంగతులు

మరో ఎనిమిది మంది కార్యవర్గ సభ్యులు కూడా వున్నారు.

### డి.సి.సి.బి. పదవీ విరమణ

జిల్లా కేంద్ర సహకార బ్యాంకులో సూపర్ వైజర్‌గా పుద్యోగంలో చేరి, అకౌంటెంట్‌గా ఎదిగి, బ్రాంచి మేనేజర్‌గా వివిధ చోట్ల పనిచేసిన ఏ. ఆదిశేషయ్య 30 తేది పదవీ విరమణ చేశారు. 1958లో సర్వీసులో చేరి, రిటైర్ అయ్యేవరకు సౌమ్యునిగా పనిచేసి పదిమంది మన్ననలు పొందారాయన. బ్యాంకు అధ్యక్షులు వేమారెడ్డి రామచంద్రారెడ్డి ఆదిశేషయ్యను దుశ్శాలువాతో కప్పి సన్మానించగా జనరల్ మేనేజర్ కె. నాగేశ్వరరావు ఆయన సేవలను ప్రస్తుతించారు.

### పొణకా కనకమ్మ విగ్రహం నెలకొల్పాలి!

మాజీ శాసనసభ్యుడు, రాష్ట్ర మద్యనిషేధ ప్రచార కమిటీ సభ్యుడైన స్వర్ణా వేమయ్య ప్రభుత్వం ద్వారా తనకొచ్చే పెన్షన్‌తో ఒక మహిళా ట్రస్ట్ ఏర్పాటు చేశారు. శాశ్వత నిధి మొత్తంపై వచ్చే వడ్డీతో జిల్లాలో

కొరవ 6వ పేజీలో

## సణుగుడు

డేలేంద్ర

* ఈనోటికి అర్థంటుగా తాళం వేయాలి!
* మహిళాధికార్లైనా మార్గదర్శకురాలు!

ఎందుకూ పనికిరాని వెధవలు చిట్ట చివరగా వెతుక్కొనే జీవనోపాధి రాజకీయం అని సెలవిచ్చిన ఆంగ్లేయ మహనీయుడి పేరు నాకు సమయానికి గుర్తురావడం లేదు కాని, అటువంటి జీవన వాస్తవం కనిపెట్టిన ఆయన మేధాసంపత్తికి ఇప్పుడు జోహార్లర్పించా లన్పిస్తున్నది. రాజకీయానికి ఏ అర్హతలూ అవసరం లేని మాట నిజమే కాని, కొన్నయినా అనర్హతలు నిర్ణయించక పోవడం పెద్దలు చేసిన ఘోర తప్పిదం.

నాటు సారా సామ్రాజ్యానికి మకుటం లేని మహారాజుగా నిన్న మొన్నటి వరకు వెలుగొందిన రావుల అంకయ్య గౌడ్ ఇప్పుడు వెనుక బడిన తరగతుల నాయకుడిగా అవతారమెత్తి, పూరూరు తిరిగి చేస్తున్న ఉపన్యాస విన్యాసాలు వింటుంటే, పత్రికల్లో చదువుతుంటే ఆ ఆంగ్లేయుదొర ఎంత దూరదృష్టి కలవాడో గదా అన్పిస్తున్నది. అంకయ్య గౌడ్ గత చరిత్ర తెలియని వారు జిల్లాలో ఎవరూ లేరు. ఆయన కాయించే నాటు సారా ఎంత రుచికరమైనదో, ఎంత ఘాటుగా నిషా ఎక్కిస్తుందో సారా ప్రియులంతా ఇప్పటికీ కథలు కథలుగా చెప్పుకుంటుంటారు. ఆయన సామ్రాజ్యంలోకి వెళ్ళి బట్టీలు తాకడానికి పెద్ద పెద్ద కొమ్ములు తిరిగిన అధికారులే జంకేవారు. కరెన్సీ కట్టలతో అధికారుల కళ్లు, రాజకీయ వాదుల నోళ్లు కట్టేస్తూ న మూయించడంలో ఆయన కాయనే సాటి. బహిరంగంగా చెప్పేమరీ చట్ట వ్యతిరేక వ్యాపారాలు చేసినా గౌడుని చట్టం ఎప్పుడూ, ఏమీ చేయలేకపోయింది. ఈ దేశంలో రాజకీయ మహిమ అటువంటిది.

ఇప్పుడు సారా అమ్మకాలు లేవు; నాటు సారాకూ ధాన్సు రాలేదు. ఖాళీగా వుండడమెందుకని రాజకీయాల్లో మునిగి తేలుతున్నారు; వృద్ధనారీ పతివ్రతలా ధర్మోపన్యాసాలు వల్లిస్తున్నారు. అంత వరకు ఆగితే ఎవరికీ నష్టంలేదు. కానీ బట్టీల దగ్గర కూలీలతో మాట్లాడే భాష మైకులో విన్పించడం, తక్కిన రాజకీయ వాదులు వాటిని వెస్ట్రన్ మ్యూజిక్ లాగా విని ఆనందించడం అసహ్యంగా వుంది. పెంచలకోన దేవాలయం ప్రాంగణంలో పార్లమెంట్ సభ్యురాలు కుమారి పద్మశ్రీని ఆయన తిట్టిన తిట్లు, వాడిన భాష వింటే, గౌడ్‌ను ప్రక్కన పెట్టుకొని తిరగడానికి తతిమా రాజకీయ వాదులకు మనసెట్లా ఒప్పుతుందో అర్థం కావడంలేదు. దేవాలయానికి వచ్చిన మహిళా భక్తులు, దేముణ్ని చూస్తే వచ్చే పుణ్యం కంటే, దేవస్థానంలో ఈ తిట్లు వింటే వచ్చే పాపమే ఎక్కువని పారిపోయారట.

రాజకీయాల్లో స్వేచ్ఛగా మాట్లాడే హక్కు వుండకాని, తోటి రాజకీయ వాదులను తూలనాడే హక్కు

కొరవ 6వ పేజీలో

# పెంచలకోన రాజకీయ తిరునాళ్లు!

పెంచలకోన నరసింహస్వామి ధర్మకర్తల మండలి ఛైర్మన్ శ్రీ పాపకన్ను జయచంద్రశేఖర రెడ్డి ప్రమాణ స్వీకారోత్సవం 3తేది ఉదయం మాగుంట విజయోత్సవంగా జరిగింది. మామూలుగా అయితే ఏ ఎండోమెంట్స్ గుమాస్తా ఎదురుగానో కూర్చుని కాగితంపై సంతకం పెట్టడమే ప్రమాణ స్వీకారంగా వుండేది. కాని పెంచలకోన దేముడిపై పెత్తనం తమ వర్గాధిపత్యానికి గుర్తుగా భావించి ఆనం, మాగుంట వర్గాలు ఈ దేవాలయాన్ని కప్పంగా మార్చి, రాజకీయ జూదమడుగును చెలకడం వల్ల, ఛైర్మన్ పదవీ స్వీకారం అంత ప్రాధాన్యత సంతరించుకున్నది.

ముఖ్యమంత్రి దగ్గర చివరిమాట తమదే అయిందని రాహూరు జనానికంతటికీ తెలియ పర్చదల్చిన మాగుంట సుబ్బరామిరెడ్డిగారు తన మంది మార్బలాన్నంతటినీ 3తేది

### అది మాగుంట విజయోత్సవమే!

పెంచలుకోనకు తరలించారు. ఎందువల్లో అసలీ రచ్చకంతటికీ సూత్రధారిగా వ్యవహరించిన దేముళ్ల మంత్రి శ్రీ కలికి యానాదిరెడ్డి మాత్రం ముఖం చాటేశారు. ఎమ్మెల్యేలు విష్ణువర్ధనరెడ్డి, జక్కారెడ్డి, మాదాల జానకిరాం; మాగుంట కంపెనీల ఛీఫ్ ఎక్సిక్యూటివ్ శ్రీ పివి ప్రసన్నరెడ్డి తదితరులంతా హాజరైనారు. జనాన్ని బాగా సమీకరించారు. ఉపన్యాసాలన్నీ రాజకీయపరమైనవే! అందరూ ఆనం వారిని తిట్టిన తిట్లు తిట్టకుండా తిట్టారు. బయటి వారు వచ్చి రాహూరును ఏలాలనుకుంటే కుదరదని మాగుంట సుబ్బరామిరెడ్డిగారు హెచ్చరించారు. అంటే, నెల్లూరు నుంచి ఆనం వారు ఎమ్మెల్యేగా రాకూడదని అన్నమాట. ఒంగోలుకు ప్రాతినిధ్యం వహిస్తున్న సుబ్బరామిరెడ్డి గారు తాను కాకుండా మరొకరి చేత ఆ మాట అన్పించి వుంటే బాగుండేది!

ఈ తిరునాళ్లకు జనార్థనరెడ్డి అనుచర ముఖ్యుడైన ఎమ్మెల్సీ సివి శేషారెడ్డిని, కో ఆపరేటివ్ బ్యాంకు ఛైర్మన్ శ్రీ వేమారెడ్డి రామచంద్రారెడ్డిని రప్పించాలనే ప్రయత్నం గట్టిగా జరిగింది. అక్కడికి పాత మాగుంట ఖాతాలో జమ పడి పోతామేమోనని శంకతో కాబోలు, ఎంత బ్రతిమలాడినా వారు ఖాతరెక్కలేదట. జానకి రాం గారి పోక, మాటల స్పీడులో ఎదో పొరపముండాలి; జనార్థనరెడ్డిని వ్యతిరేకించి పోయె ధైర్యం కలలో

కొరవ 6వ పేజీలో



# నెల్లూరు వాణిజ్యాలు విలేఖకుడు

## జియ్యర్ స్వామికి సోమశిల ఆశ్రమం

సోమశిల ప్రాజెక్టును ఆనుకొని అత్యంత ప్రశాంత వాతావరణంలో నిర్మితమై వున్న పరమానందాశ్రమాన్ని, దానిలోని దేవాలయాలను చిన్న శ్రీమన్నారాయణ జియ్యర్ స్వామి దత్తత తీసుకొంటున్నారు. విజయవాడ వద్దగల సీతానగరంలో నివసించే జియ్యర్ స్వామి అద్వైత వేదాంత పాండిత్యం కలిగిన వేదమూర్తులు. స్వయంగా వేద విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్నారు. రాష్ట్రమంతా వైష్ణవులలో అపార అనుచర వర్గం వుంది. జియ్యర్ స్వామి నేతృత్వమంటే సోమశిల ఆశ్రమానికి వైభవం సంతరించినట్లే లెక్క.

ఈ దత్త స్వీకారోత్సవం కోసం జియ్యర్ స్వామి 10 తేది సోమశిల వస్తున్నారు; 11 తేది వరగలిలో వేమారెడ్డి కుటుంబీకుల ఆతిథ్యం స్వీకరిస్తారు.



## అమెరికాలో జెవి

రోటరీ మాజీ గవర్నర్ శ్రీ జవిరెడ్డి విశ్రాంతి కోసం అమెరికా వెళ్తున్నారు. అక్కడి అనుభవాలతో విరులేఖ వ్రాశారాయన. పై వారం ముచ్చటించుకుందాం!







## ఎస్‌వి విశ్వవిద్యాలయంలో విష్ణుకు సభ్యత్వం

శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం పాలక మండలి సభ్యునిగా అల్లూరు ఎమ్మెల్యే శ్రీ విష్ణువర్ధనరెడ్డిని నియమించింది రాష్ట్ర ప్రభుత్వం. ప్రజా ప్రతినిధుల తరఫున ప్రాతినిధ్యం వహిస్తారాయన.

## రెడ్‌క్రాస్ రక్తనిధి

నెల్లూరు రెడ్‌క్రాస్ తరఫున ఒక బ్లడ్‌బ్యాంకు ఏర్పాటు చేయడానికి ప్రయత్నిస్తున్నారు. నిధుల సమీకరణ, ఏర్పాట్లు తీరు తెన్నులపై చర్చ జరపడానికి 10 తేది ఆదివారం రెడ్‌క్రాస్ భవనంలోనే సన్నాహక సమావేశం జరుగుతుంది.

రక్తదానం ప్రాణదానంతో సమానం. బృహత్తరమైన ఈ మానవీయ కార్యక్రమానికి తలా ఒక చేయి అందించండి!

## లాయర్-పోలీసు వివాదం ముగిసింది

కరణాల వీధికి చెందిన న్యాయవాది రాజారెడ్డిని వన్‌టౌన్ స్టేషన్ లాకప్‌లో వేసి, కొట్టిన సంఘటనకు సంబంధించి న్యాయవాదులు, పోలీసుల మధ్య రగడ పెరిగిపోతూంది. వన్‌టౌన్ ఎస్‌ఐ రజనీకాంతరెడ్డిని బదిలీ చేసి విచారణ జరిపించాలని డిమాండ్ చేస్తూ న్యాయవాదులు ఒక రోజు కోర్టులు కూడా బహిష్కరించారు. ఈలోగా, పదిహేను రోజుల క్రితం తనపై ఎస్‌ఐ రజనీకాంతరెడ్డికి సంబంధించిన రౌడీలు దౌర్జన్యం చేశారని, చంపబోయారని న్యాయవాది రాజారెడ్డి కొత్త కేసు పెట్టాడు. హరిజనుడైన అతని స్నేహితుడు తనను కులం పేరుతో దూషించాడన్న ఆరోపణతో ఎస్‌ఐ పైన అత్యాచార నిరోధ చట్టం క్రింద మరొక కేసు దాఖలు చేశారు.

న్యాయవాదుల వలెనే, పోలీసుశాఖ కూడా దీనిని తమ డిపార్టుమెంట్ ప్రతిష్టగా తీసుకొన్నట్లుంది. తన గదికి రౌడీలు వచ్చి తనను చంపబోయారని రాజారెడ్డి దాఖలు చేసిన కేసు పూర్తిగా తప్పుడుదని ; రాఘవ సినీ కాంప్లెక్స్ ప్రక్కన, రైలు కట్టపైన వ్యభిచారిణుల విషయంలో ,చాకలివీధికి చెందిన విజయకుమార్ అనే అతనితో రాజారెడ్డి గొడవపడి, తన్నులు తిన్నాడని, ఎస్‌ఐ అతణ్ని కొట్టించడం అబద్ధమని పోలీసు అధికారులు ఒక కొత్త కథనం అల్లారు. విజయకుమార్ పోలీసు ''మిత్రుడు''; ఎప్పుడవసరం పడితే అప్పుడు కోర్టులలో సాక్షిగా వాడుకునే 'స్టాక్ విట్‌నెస్'. అతడు పోలీసులు చెప్పే చిలుక పలుకులే చెప్పడం సహజం. న్యాయవాదుల సంఘం ఈ కథను కొట్టివేస్తూ, సిబిసిఐడి చేత నిజానిజాలు దర్యాప్తు జరిపించాలని కోరుతున్నది.

గౌరవనీయమైన వృత్తిలో వున్న ఇద్దరు బాధ్యతాయుత వ్యక్తులు ఇంత అల్పంగా ప్రవర్తించడం అసహ్యంగా వుంది. రెండు పక్షాలలోని పెద్దలెవరైనా జోక్యం చేసుకొని ఈ రభసకు ఫుల్‌స్టాప్ పెట్టకుంటే రెండు శాఖల పరువు గంగ పాలౌతుంది.

## పబ్లిక్ అకౌంట్స్ కమిటీ నెల్లూరు పర్యటన

రాష్ట్ర శాసనసభకు చెందిన పబ్లిక్ అకౌంట్స్ కమిటీ జిల్లాలో వివిధ శాఖల పనితీరు సమీక్షించడానికి 6, 7 తేదీలలో నెల్లూరులో పర్యటించింది. సోమశిల ప్రాజెక్టు, పైపాడు టిప్ తదితరాలు చూసుకొని తిరుమల వెళ్లారు. మొత్తం 16 మంది ఎమ్మెల్యేలు ఈ కమిటీ సభ్యులుగా నెల్లూరు వచ్చారు.

కలెక్టరేటులో వివిధ శాఖల సమాచారం అరగడానికి సమావేశం జరిపితే, రెవిన్యూ వంటి ఒకటి రెండు తప్ప తక్కిన శాఖలన్నీ తెల్లముఖం పెట్టి కూర్చున్నాయి. పోలీసు, ఎక్సైజ్, విద్య, వ్యవసాయం, దేవాదాయం, మునిసిపల్ అధికారులు సభ్యులడిగిన లెక్కలు చెప్పలేక తడబడ్డారట. కలెక్టర్ చాకచక్యంతో వ్యవహరించి, సర్దడానికి ప్రయత్నించినా సభ్యులు సంతృప్తి పడలేదు. లెక్కలు చూపలేని అధికారులకు షోకాజ్ నోటీసులు ఇవ్వాలని కలెక్టర్‌ను ఆదేశించి వెళ్లారు.

## క్లబ్

నెల్లూరు దర్గామిట్టలోని సరస్వతి నగర్‌లో 'ది క్లబ్' పేరిట ఒక సాయం విహార కేంద్రం ప్రారంభమైంది. స్విమ్మింగ్ పూల్ నుంచి జిమ్ వరకు, అన్ని ఆధునిక సౌకర్యాలున్నాయి. వ్యాపారోద్దేశ్యమే అయినా మంచి టేస్ట్‌తో ఏర్పాటు చేశారు.

నెల్లూరులో మధ్య తరగతి కుటుంబీకులకు సాయంత్రం ఒక గంట సరదాగా గడపడానికి స్థలమే లేదు. సినిమా హాల్ తప్ప కాలక్షేపం లేదు. సినిమా హాళ్లు చూద్దామా అంటే, ఎందుకొచ్చామా అన్న విసుగు పుడుతుంది. ఈ క్లబ్బైనా మధ్య తరగతి వారికి అందుబాటులో, మంచి సేవలతో నిర్వహిస్తే బాగుంటుంది. జిల్లా కో ఆపరేటివ్ బ్యాంకు ఛైర్మన్ శ్రీ వేమారెడ్డి రామచంద్రారెడ్డి 3 తేది క్లబ్‌కు రిబ్బను కత్తిరించారు.

## పెద్దాస్పత్రి సూపరింటెండెంట్ మృతి

నెల్లూరు పెద్దాస్పత్రి సూపరింటెండెంట్ డాక్టర్ దత్తాత్రేయులు (54) 5 తేది వేకువన హఠాత్తుగా మరణించారు. గుండెపోటు వచ్చిందట - అపోలో ఆస్పత్రికి తరలించారు. కాని ప్రయోజనం లేకపోయింది.

దత్తాత్రేయులు గారు కడప జిల్లావాసి ; కొంతకాలం సైన్యంలో పనిచేశారు. చాలా సౌమ్యుడు ; మృదుభాషి. పాపం, అకాల మృత్యువు పాలైనారు.

సూపరింటెండెంట్‌కు అనారోగ్యమైతే ప్రైవేటు ఆస్పత్రికి తరలించ వలసినంత అధ్వాన్నంగా వున్నాయా, పెద్దాస్పత్రి వైద్య సౌకర్యాలు ; ఇక సామాన్యుల గతేమిటి అక్కడ!

## నెల్లూరు బజారు

మొలగొలుకులు

| | |
|---|---|
| 9672 | 3,500/- |
| 9674 | 3,800/- |

## నెల్లూరు సంగతులు

పదవ, ఏడవ తరగతి పబ్లిక్ పరీక్షల్లో ప్రతిభావంతంగా వచ్చే బాలికలకు నగదు బహుమతు లందిస్తున్నారు. తహసీల్ రంగనాయకుల పేటలోని వి.ఎమ్.ఆర్. మునిసిపల్ హైస్కూల్ విద్యార్థులు ఈ ప్రోత్సాహకాలు పొందారు. ఈ సందర్భంగా ఏర్పాటైన కార్యక్రమంలో స్వర్ణా వేమయ్య మాట్లాడుతూ బాలురతోపాటు బాలికలను కూడా వారి తల్లిదండ్రులు సమంగా చూడాలి. జిల్లాలో పలు ఉద్యమాలకు మహిళలే పూనిక పోశారు. అక్షరాస్యత, మద్య నిషేధ, వయోజన విద్య, పొదుపులక్ష్మి ఉద్యమాలు వారివల్లే విజయవంత మయ్యాయి. ఈ స్ఫూర్తి ఈనాటిది కాదు; జాతీయోద్యమంలో వీర యోధురాలు పొణకా కనకమ్మ నుండి నెల్లూరీయులకు ఉద్యమశక్తి వారసత్వంగా లభించిందన్నారు. అటువంటి యోధురాలు కలకాలం గుర్తుంచేట్లు ఆమె విగ్రహాన్ని టౌన్‌లో నెలకొల్పాలన్నారు. కార్యక్రమంలో మునిసిపల్ కమీషనర్ కెప్టెన్. డివిరెడ్డి, డి.పి.ఆర్.ఓ. వేణుగోపాల్, హైస్కూల్ ప్రధానోపాధ్యాయుడు రాఘయ్య తదితరులు పాల్గొన్నారు.

### కృష్ణ అభిమానుల బస్ షెల్టర్

సినీ నటుడు కృష్ణ అభిమానులు విజయమహల్ గేటు ప్రక్కన నిర్మింప తలపెట్టిన బస్ షెల్టర్‌కు ఎమ్మెల్యే జె.కె.రెడ్డి 3 తేది శంకుస్థాపన చేశారు. 20 వేల రూపాయలు వెచ్చించి నిర్మిస్తున్న ఈ షెల్టర్‌ను ఈ నెలాఖరుకు ప్రారంభించనున్నట్లు కృష్ణ ప్రజాశక్తి కన్వీనర్ షేక్ సిరాజ్ చెప్పారు. కార్యక్రమంలో ఆర్యవైశ్య సంఘం అధ్యక్షుడు చీదెళ్ల వెంకటేశ్వర్లు, జిల్లా కాంగ్రెస్ కమిటీ సహ కార్యదర్శి షేక్ మొహియుద్దీన్, ఫిలిమ్ డిస్ట్రిబ్యూటర్ పి. శ్రీనివాసులు రెడ్డి తదితరులు

### పెద్ద చెరుకూరు గ్రామ పంచాయితీ

#### టెండరు నోటీసు

నెల్లూరు మండలం, పెద్ద చెరుకూరు గ్రామ పంచాయితీకి 1994 - 95 సం.మునకు గొట్టపు బావులు విడి భాగములు మరియు P.W.S స్కీము విడిభాగములు దఫాల వారిగా సరఫరా చేయుటకు టెండరు ధరావత్తు రూ. 50/- లు. 2. చెడిపోయిన గొట్టపు బావులు పెరికి మరలా వేయుటకు 40 అ. వరకు రేటు రేటు 1 కి నిర్ణయించుటకు టెండరు ధరావత్తు రూ. 100/- లు సీల్డు టెండర్లు 20.7.94 తేదిన ఉదయం 11 గంటల లోగా కోరడమైనది. టెండరు ధరావత్తు పై కనపరచిన విధంగా వేరు వేరుగా చెల్లించి రశీదును టెండరుకు జతపరచ వలయును. ఇతర వివరములు ఆఫీసు పని చేయు వేళలలో తెలుసుకొన వచ్చును.

చెరుకూరు రామయ్య
పర్సన్ ఇన్‌ఛార్జి
పెద్దచెరుకూరు గ్రామపంచాయితీ

( 4 వ పేజీ కొరవ )

### రాష్ట్ర స్థాయిలో పాటల పోటీలు

'నేస్తం' చందరరామిరెడ్డి తృతీయ వర్ధంతిని పురస్కరించుకొని సాంస్కృతిక సంస్థ 'కళారాధన' రాష్ట్రస్థాయిలో పాటల పోటీలు నిర్వహిస్తుంది. జూలై 23 తేది ఫంక్ ఆఫీసులో లలిత, సినిమా సంగీతంతో పాటు జానపద నృత్యాలు, ఏక పాత్రాభినయ పోటీలు పెడతారు. సీనియర్స్, జూనియర్స్‌కు వేరువేరుగా బహుమతులిస్తారట. వివరాలకు బి. చంద్రశేఖరరెడ్డి, కార్యదర్శి కళారాధన, వెరైటీ కూల్‌డ్రింక్స్ ట్రంక్‌రోడ్డు నెల్లూరుకు వ్రాసి తెలుసుకోవచ్చు.

### దొందూ..దొందే

మొదటి పేజీ కొరవ

నర్సిరెడ్డిని సస్పెండ్ చేశాడు. దీనితో ముఖ్యమంత్రి చిన్న బుచ్చుకున్నారు. పార్టీలో అందరికీ ఆదర్శంగా ఉండాల్సిన పిసిసి పెద్ద తన ప్రత్యర్థికి టిక్కెట్టు ఇప్పిస్తానని చెప్పి 'జోరుగా హుషారుగా షికారు చేయడం' తనకు నచ్చలేదని, ఈ కారణంగానే నాగలక్ష్మిని మందలించబోతే మజ్జి అడ్డు పడ్డాడని, దానితో చేయి చేసుకోక తప్పలేదని నర్సిరెడ్డి ముఖ్యమంత్రితో మొర పెట్టుకున్నాడు. తులసీతో కయ్యానికి ఇష్టపడని ముఖ్యమంత్రి ఈ విషయంలో మౌనం వహించాడు. దీనితో మజ్జి మరింత రెచ్చిపోయి నర్సిరెడ్డి హంతకుడని, గూండా అని తీవ్రమైన ఆరోపణలు చేశాడు. సొంత పార్టీ ఎమ్మెల్యేను ''ఇంతగా'' తిట్టిన పిసిసి అధ్యక్షుడు బహుశా తలుసీ కావచ్చు. అయితే పిసిసి అధ్యక్షుడి మార్పు రేపో మాపో అనుకుంటుండగా మజ్జివారి ఈ 'చిలిపి' చేష్టలు పార్టీ పరువు నట్టేట ముంచుతున్నాయి. ఇదిలా వుండగా రాయలసీమ కాంగి ముఠా తగాదాలు మళ్లీ రాజు కుంటున్నాయి. డాక్టర్ వైఎస్ రాజశేఖర రెడ్డిని ఇటీవల ఒక సభలో మైసూరారెడ్డి తీవ్రంగా దుయ్యబట్టారు. దీంతో వైఎస్ ఎమ్మెల్యేలు తిరిగి మైసూరాపై తిట్ల వర్షం కురిపించారు. వచ్చే ఎన్నికల్లో ఈ రెండు ముఠాలు ఒకరినొకరు వెన్నుపోట్లు పొడుచు కోవడం తప్పేట్లు లేదు.

పెంచలకోన
4 పేజీ కొరవ

కూడా ఆయనకు వుండదు కాని, సైబ్లర్ ప్రభావమో, ఎన్నికల్లో ఒక్కపోటు పొడుస్తారనే భయమో జానకిరాంను అంత దూరం నడిపించినట్లున్నాయి!

రాపూరులో ఇంత పెద్ద సభ జరిపించడం ద్వారా మాగుంట వర్గం అనం వారికి పెద్ద సవాలే విసిరింది. దీనికి విరుగుడు వారికింకా తోచినట్లు లేదు.

ఛైర్మన్ జయచంద్రశేఖరరెడ్డి సంపన్నుడు; దేనికీ కొదువ లేనివాడు. కాని, గత పర్యాయం ఆయన

పాలనలో విధులన్నీ పారించుకొనిపోయి . జీతాలివ్వలేని దరిద్రానికి నెట్టబడ్డారు పెంచలుకోన దేముడు. అభివృద్ధి కాగడా వేసి వెతికినా కన్పడకుండా, ఖజానా ఖాళీ అయిందంటే అవమానం కాదా? రెండు కోతల యుద్ధం నడుమ ఉద్బుదియంగా మళ్లీ వచ్చిన అవకాశన్నయినా ఆయన వుపయోగించుకొని, దేముడ్ని దివాలా తీయించ కుండా కాపాడితే పదవి సార్థకమౌతుంది!

జనవాణి
3 పేజీ కొరవ

తరలించమని ఆ ప్రాంతీయులు ఎన్నో మారులు ఆందోళన చేశారు. గతంలో జిల్లా కలెక్టర్లుగా పనిచేసిన డాక్టర్ మహాపాత్ర, జన్నత్ హుసేన్, రాజా గార్ల జోక్యంతో మునిసిపల్ అధికారులు కొంత శాతం వర్క్‌షాపులను ఆటోనగర్‌కు తరలింప చేయ గలిగారు. కాని కొందరు వర్క్‌షాపుల యజమానులు తరలింపుకు సహకరించ కుండా జేమ్స్ గార్డన్‌లోనే మొరాయించి షాపులు కొనసాగిస్తుండేవారు. పబ్లిక్ రోడ్డులనే వర్క్‌షాపులుగా మార్చుకొని దారినపోయే వారిని, వాహనాలను ఇబ్బందుల పాలు చేస్తున్నారు. వర్క్‌షాపుల తరలింపుకు అధికారుల అలసత్వం కంటే రాజకీయ నాయకుల అనవసర జోక్యం చాలా వరకు కారణంగా వుండింది. ఎట్టకేలకు జిల్లా కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివరావు, మునిసిపల్ కమీషనర్ కెప్టెన్ డివిరెడ్డి, మునిసిపల్ ఇంజనీర్ ఎం. రామసుబ్బారెడ్డి గార్ల క్రియాశీలక, నిర్మాణాత్మక ఆలోచనలవల్ల జేమ్స్‌గార్డన్‌లోని దురాక్రమణ దారులు తోక ముడిచారు. ఇంతవరకు అక్రమణల పాలైన స్థలంలో కొత్తగా రోడ్లకు ఇరువైపులా నీడ నిచ్చే చెట్లను, వుద్యాన వనాలను నిర్మించేందుకు నడుంకట్టడం ఆనందదాయకమైన విషయం.

నెల్లూరు -ఆచార్య పిసిరెడ్డి

### సమ్మోహితులను చేసిన జ్ఞానబోధ

ధవళేశ్వర ఆశ్రమాధిపతి యైన జ్ఞానబ్రహ్మ సుందర చైతన్యానంద స్వామి గత మాసంలో పది రోజులు టౌన్‌లో నిర్వహించిన 118 వ జ్ఞాన యజ్ఞ మహాసభలు సమస్త భక్తకోటిని సమ్మోహితులను చేశాయి. ఉదయం రమణ మహర్షి బోధనలు, సాయంత్రం భాగవతంపై కడు చక్కని వుపన్యాసాలు చేశారాయన. గంగా ప్రవాహం వలె అలుపెరుగక ప్రవహించే వాక్ సంపద; రాగ, సుధారసమును మధుర కంఠముతో తాళ, భావ, రాగయుక్తంగా ఆలపించిన గానం అందరినీ అలరించాయి. అంత పెద్ద ప్రజా సమూహంలో కార్యకర్తల హడావుడిగాని, పోలీసుల పరుగులు గాని లేక ప్రశాంతత ఆ ప్రాంతంలో పరిఢవిల్లింది.

నెల్లూరు - బి.పట్టాభిరామయ్య

### ఎడతెగని మినీ బైపాస్ నిర్మాణం

నెల్లూరు టౌన్ ప్రజల కష్టాలు తీర్చేందుకు ప్రారంభించిన మినీ బైపాస్ రోడ్డు పనులు మూడు నెల లంతాననే పూర్తి అవుతాయని రాజకీయ నాయకులు, ఇంజనీర్లు సెలవిచ్చారు. కాని ఇప్పటివరకు కట్టిన బ్రిడ్జిలకు అప్రోచ్‌లను సరిగా కలపలేదు. చాలావరకు రోడ్డు వేసిన తరువాత ప్రస్తుతం తూముల నిర్మాణం చేపడుతున్నారు. సిటీ రద్దీని తట్టుకోలేక ఉదయం ఆ రోడ్డులో బయలుదేరి పోతే సాయంత్రానికి ఆదే రోడ్డున రాలేనన్ని ఆడ్డంకులు. కాంట్రాక్టర్లకు- ఇంజనీర్లకు సమన్వయం వున్నట్లులేదు. ఒకరోజు రోడ్డు ఓపెన్ అని, మరో రోజు రోడ్డు క్లోజ్ అని బోర్డు పెట్టి హంగామా చేస్తున్నారు. పని కూడా నత్త నడకన సాగుతోంది. ఎమ్మెల్యేగారు ప్రకటనలకే పరిమితం కాకుండా పనిని త్వరితగతిన పూర్తి చేయిస్తారని ఆశిస్తాము.

నెల్లూరు -వాస్తు రామచంద్ర

### నేటి నాయకుల తీరు

గొంగళి మీద కూర్చుని వెంట్రుకలు ఏరినట్లు ఇటీవల నాయకులు ఒకరినొకరు అవినీతి ఆర్జన చేసేవారని విమర్శలు చేసుకొంటున్నారు. ప్రజల్లో తమ పట్ల చులకన భావన కలిగినా, పత్రికల్లో పేరు పడితే చాలన్నట్లు సంతోష పడుతున్నారు. రాజకీయ దోపిడి ఒక పార్టీకే పరిమిత మైందని అనుకోవడం పొరపాటు. కొన్ని పార్టీలవారు బహిరంగంగానే చందాలు అడుగుతున్నారు. కొందరైతే లోలోపల సర్దుకుంటున్నారు. జై ఆంధ్రా వుద్యమం లగాయితు చందాల బెడద జాస్తిగానే వుంది. ఈ విమర్శలు చేసుకొనే నాయకులు రాజకీయ ప్రవేశానంతరం ఎంతెంత సంపాదించింది లెక్కలతో సహా వెల్లడిస్తే ప్రజలు చేయగల్గింది చేస్తారు.

నెల్లూరు - టి.వి.నారాయణ

సణుగుడు
4 పేజీ కొరవ

ఎవరికి ఎవరూ ఇవ్వలేదు. గౌడ్ వంటి అసాంఘిక శక్తులను వెంట త్రిప్పుకునే నాయకులు కనీసం ఆయన నోటికి అర్జంటుగా సీలైనా వేయించకుంటే - జిల్లాలో ఏ రాజకీయ పార్టీకి పరువు మిగలదు. * * *

మన ప్రభుత్వోద్యోగులకు ఈ నోటీసులేక బొక్క?

హైదరాబాద్ సిటీ మునిసిపల్ కార్పొరేషన్ కమీషనర్ శ్రీమతి రాఘెల్ ఛటర్జీ భాగ్యనగరం దాదాలు, రౌడీల గుండెల్లో బేజారు పుట్టిస్తు[illegible] రోడ్డు ప్రక్కన ఎక్కడ ప్రభుత్వ స్థలం కన్పించినా ఆక్రమించి అమ్ముకోవడం అలవాటైన దాదాలు ఆమె ధాటికి నేలకు బల్లపరుపుగా వాలి, సాష్టాంగ పడుతున్నారు. పెద్ద పెద్ద కంపెనీలు, పలుకుబడి కల్గిన వారి బోర్డులు, గిద్దులు కూడా పీకి పారేశారు. పోలీసధికారులు కూడా పగటి పూట సైతం తిరగడానికి భయపడే పాత నగరంలో ఆక్రమణ దారులను వెంటాడి, వేటాడి తరుముతున్నారామె. ఒవైసీ అంతటి వారు నేరుగా వీధిలోకి వచ్చి హుంకరించినా, ఆమె బుల్‌డోజర్ల అరక్షణం ఆగలేదు. ఎవరేమన్నా, ఎవరెంత బెదిరించినా తన పనితాను చేసుకుంటూ పోతూనే వున్నారు. గలీజుగా, గబ్బుగబ్బుగా, చిందర వందరగా వుండే రాజధాని రోడ్లకు కొత్త అందాలు సంతరిస్తున్నారు.

ఒక మహిళా అధికారి చిత్తశుద్ధితో విద్యుక్త ధర్మం నెరవేర్చడానికి అన్ని శక్తులతో ఒంటరి పోరాటం చేయడం అసాధారణం, అభినందనీయం. ఆమె వంటి అధికారి జిల్లాకు ఒకరుండినా రాష్ట్రం బాగు పడిపోతుంది.



నెల్లూరు కోఆపరేటివ్ బ్యాంక్ బ్రాంచి మేనేజరుగా రిటైరైన ఆదిశేషయ్యను శాలువతో సత్కరించి వీడ్కోలు చేస్తున్న ఛైర్మన్ వేమారెడ్డి రామచంద్రా రెడ్డి.

# ఫిబ్రవరి 15 వరకే నీళ్లు!

కనిగిరి రిజర్వాయరు

[illegible] చెరువు, కనుపూరు కాల్వల ద్వారా జిల్లాలో రెండవ పంట కాలానికి వరి నారు పోసుకునేందుకు నీరు విడుదల చేయనున్నారు. ఆగస్టు 15 నుంచి వరినారు పోసుకోవడానికి; సెప్టెంబరు 15 నుంచి అక్టోబర్ 10 వరకు దుక్కికి, నాట్లు వేసుకోవడానికి నీరు సరఫరా అవుతుంది. 1995 ఫిబ్రవరి 15 వరకు నీరు విడుదల చేస్తూనే వుంటారు. మార్చి నెల నుంచి డెల్టా ప్రాంతంలోని మధ్యతరహా, చిన్న తరహా మురుగు కాల్వల మరమ్మత్తులు చేస్తున్నందువల్ల ఫిబ్రవరి 15 తర్వాత ఎటువంటి పరిస్థితులలోనూ నీరు విడుదల చేయమని జిల్లా వ్యవసాయ శాఖ సంచాలకులు చెన్నకేశవులు చెప్పారు. రైతులు ఈ విషయాలను దృష్టిలో వుంచుకొని 150 నుంచి 160 రోజుల కాల పరిమితి గల పంట రకాలు ఎంచుకోవాలని కోరుతున్నారాయన. వరినారు పోయడానికి నాటడానికి 2,3 నెలల కాలపరిమితి వున్న దృష్ట్యా తక్కువ రోజులలో కోతకు వచ్చే పెసర రకాలు [illegible] [illegible] వ్యవసాయ శాఖాధికారులు సలహాయిస్తున్నారు.

## 19.75 లక్షలు మంచినీటి సౌకర్యానికి

జిల్లాలో మంచి నీటి సమస్య తీవ్రంగా వున్న ప్రాంతాల్లో సౌకర్యాలు కల్పించడం, [illegible] పెంపుదల, పైపులైన్లు, నీటి తొట్ల నిర్మాణానికి 19.75 లక్షలు మంజూరైనట్లు కలెక్టర్ [illegible] సోలంకి [illegible] చెప్పారు.

# వీరంపల్లిలో మధ్య యుగాల మట్టి కుండలు

జిల్లాలో ప్రాచీన కాలంలో జైన మతం పరిఢవిల్లిందన్న పురావస్తు శాస్త్రవేత్తల అభిప్రాయానికి స్పష్టమైన చారిత్రక ఆధారాలు లభించాయి. సీతారామపురం మండలం వీరం పల్లి గ్రామం లోని పాటి దిబ్బ ప్రాంతం దొరికిన మట్టి పాత్రలు, కుండపెంకుల ఆధారంగా చేసిన పరిశోధనల మూలంగా మధ్య యుగాలకు సంబంధించిన పలు విశేషాలు వెల్లడైనాయి. గ్రామానికి ఒకటిన్నర కిలోమీటరు దూరంలో ఉత్తర దిశలో పొట్టేలు వాగు దాటినాక ఆరు ఎకరాల విస్తీర్ణంలో ఈ పాటి దిబ్బ ప్రాంతముంది. ఈ చుట్టు ప్రక్కల ప్రాంతమంతా పరిశోధకులు పరిశీలించగా దిబ్బకు దక్షిణ దిశన తెలుపు జైన్ తీర్థంకుని విగ్రహం లభ్యమైంది. మరికొంత దూరంలో వినాయక, నంది విగ్రహాలతోపాటు పాడు బడిన చిన్న శివాలయం కూడా సాక్షాత్కరించాయి. దొరికిన విగ్రహాలను పరిశీలిస్తే నంది విగ్రహం ముక్కలు, ముక్కలుగా పగుల గొట్టబడి వుంది. వినాయక విగ్రహం పాక్షికంగా శిథిలమై వుంది. జైన తీర్థంకరుని విగ్రహం మాత్రం ముఖంపై దెబ్బలు ఊత గొట్టబడి వుండడం చేత ముఖంలోని ఛాయలు స్పష్టంగా కనపడకుండా వున్నాయి. ఈ విగ్రహం పిస్టరాతిపై చెక్క బడినట్లు పరిశోధకులు గ్రహించారు. అర్ధ పద్మాసనంలో కూర్చుని వున్న తీర్థంకరుడు ధ్యాన ముద్రలో వున్నాడు. దిగంబరుని మూర్తి తలపై జుట్టు వంకులు తిరిగి, శిరస్సుపై భాగంలో త్రి ఛత్రి చిహ్నాలు చెక్క బడి వున్నాయి. జైన మతానికి సంబంధించి నెల్లూరు, క్రిష్ణాపట్నం, దంపూరు, గ్రామాల్లో ఇప్పటి వరకు కొన్ని విగ్రహాలు దొరికివున్నా కూడా, వీరంపల్లిలో దొరికిన విగ్రహం భిన్నరీతిలో వుందని నెల్లూరు పురావస్తు పరిశోధక సంస్థ సాంకేతిక సహాయకుడు కొల్లూరి సాయిభక్త కేశవ అభిప్రాయ పడ్డారు. శిల్ప శాస్త్ర లక్షణాల ప్రకారం ప్రస్తుతం దొరికిన విగ్రహం ప్రాచీన మైనదని జైన మతంపై విస్తృత పరిశోధనలు చేసిన డాక్టర్ బి. జవహర్ లాల్ చెప్పారు. జిల్లాలో జైనమత అవశేషాలు ఎక్కువగా వున్నాయని; వీరంపల్లి విగ్రహం శిల్పలక్షణాలను బట్టి ఇటీవల కాలంలో కడప ప్రాంతంలో లభించిన విగ్రహాలను అది పోలి వున్నదని వెల్లడించారాయన. ఈ విషయమై మరింత లోతుగా పరిశోధనలు చేస్తే జిల్లాలోని మధ్య యుగాల నాటి పరిస్థితులు తేట తెల్లమేవుతాయని నిస్సందేహంగా చెప్పవచ్చు.

## ప్రతిభ గల విద్యార్థులకు స్టేట్‌బ్యాంక్ సహాయం

'పొదలకూరు ఎసి సుబ్బారెడ్డి మెమోరియల్ రీడింగ్ రూమ్ అండ్ యూత్ సెంటర్ ఆరవ వార్షికోత్సవం ఇటీవల జరిగింది. ముఖ్య అతిథులుగా నెల్లూరు, భారతి జూనియర్ కళాశాల కరస్పాండెంట్ జి. సుబ్బారెడ్డి, పొదలకూరు ఎస్.బి. ఐ మేనేజర్ వి. చంద్రశేఖరరావు విచ్చేశారు. సభలో బ్యాంక్ మేనేజర్ మాట్లాడుతూ ప్రతిభగల విద్యార్థులకు వారికొచ్చిన మార్కుల ననుసరించి పై చదువులు చదువుకునేందుకు బ్యాంకు ఆర్థిక సహాయం చేస్తుందన్నారు. పొదలకూరు మండల పరిధిలోని జడ్పి. పాఠశాలలన్నింటిలో పదవ తరగతి పరీక్షలలో అత్యధికంగా 540 మార్కులు తెచ్చుకున్న ఎం గోపి నరసింహం, బాలికల్లో ప్రథమురాలు కామేశ్వరికి యూత్ సెంటర్ వారు బహుమతులు అందజేశారు. బిసి బాలుర వసతి గృహానికి విద్యార్థుల సౌకర్యార్థం గోడ గడియారాన్ని అందజేశారు. యూత్ సెంటర్ కార్యదర్శి మనోహర్ వందన సమర్పణ చేశారు.

* * *

# వద్దురా బాబూ, రాపూరు ఫోన్లబాధ!

రాపూరు టెలిఫోన్లు అలంకారానికి తప్ప ప్రజలకు ఏ మాత్రం వుపయోగ పడడం లేదు. నామ మాత్రంగా వున్న ఎక్స్ఛేంజి వల్ల ప్రజలు పడరాని పాట్లు పడుతున్నారు. రాపూరు నుండి బయట ప్రాంతాలకు ఫోను చేయాలంటే పొదలకూరు ఎక్స్ఛేంజికి రింగ్ చేయాలి. అక్కడి నుండి దయా దాక్షిణ్యాల మీద ఇతర ప్రాంతాలకు ఫోన్ కలుస్తుంది. నెల్లూరు గూడూరు వంటి దగ్గరి ప్రాంతాలకు మాట్లాడను అడిగితే లైన్ సరి లేదని తరచుగా సమాధానం వస్తుంటుంది. దూర ప్రాంతం ఫోన్లలో సమస్యలున్నా, లోకల్ ఫోన్లు కూడా తరచూ మొరాయిస్తాయి. రాపూరు ఎక్స్ఛేంజిని ఎలక్ట్రానిక్ ఎక్స్ఛేంజిగా మార్చాలని మిషనరీ అంతా సేకరించినఅధికారులు ఎందువల్లనో మిన్నకుండి పోయారు. ఇప్పటికే మండలంలో 40 ఫోన్లు వుండగా మరో 30 కొత్త ఫోన్లకు దరఖాస్తులు చేసుకొని వున్నారు. క్రొత్త కనెక్షన్లు ఎప్పుడొస్తాయో ఎవరికి తెలియదు. ఎవరో ఒక నాయకుడు పుణ్యం కట్టుకుంటే గాని రాపూరు ఫోన్లు బాగుపడవు.

## స్టూడెంట్ పాస్‌ల రేట్లు సవరణ

ఇటీవల ఆర్టీసి పెంచిన స్టూడెంట్ బస్‌పాస్‌ల రేట్లను విద్యార్థి సంఘాలు చేసిన గొడవతో తిరిగి తగ్గించారు. కళాశాల, ఉన్నత విద్యాసంస్థలలో చదువుకొనేందుకు 5 కిలోమీటర్ల దూరం నుండి వచ్చే విద్యార్థుల బస్ పాస్ నెలకు 30 రూపాయలుగా నిర్ణయించారు. 10 కిలోమీటర్లకు 40 రూ. 15కి.మీ 50రూ. 20 కి.మీ 65రూ. 25 కి.మీ 80రూ; 30 కి.మీ 90రూ. 35 కి.మీ.100 రూపాయలుగా సవరించినట్లు రీజనల్ మేనేజర్ ఎమ్. వి నాగవేంద్ర రావు తెలుపుతున్నారు.

# పల్లెల్లో మరుగు దొడ్లు నిర్మించుకోండి!

ఇందుకూరు పేటలో ముస్లింల కళ్యాణ మండపం (షాదీ మంజిల్) కు సర్వేపల్లి శాసన సభ్యులు సివి శేషారెడ్డి 4వతేది శంకు స్థాపన చేశారు. ఈ సందర్భంగా ఏర్పాటైన కార్యక్రమంలో సివి మాట్లాడుతూ దేశ సమైక్యత, సమగ్రతకు హిందువులు-ముస్లిం- క్రైస్తవులు ఏకమై భాయి భాయిగా మెలగాలని కోరారు. ప్రభుత్వం ప్రవేశ పెట్టిన పారిశుధ్య పథకాన్ని గురించి వివరిస్తూ గ్రామ ప్రజలు 400 రూ చెల్లిస్తే, ప్రభుత్వం 1600 ఇస్తుందని, దీనితో మరుగు దొడ్లు నిర్మించుకోవాలని విజ్ఞప్తి చేశారు. ఇందుకూరు పేటకు అర్బన్ హౌసింగ్ స్కీం తెస్తానని ఎమ్ వాగ్దానం చేశారు. 75మందికి ఇళ్ల స్థలాల పట్టాలు కూడా పంపిణీ చేశారు. పాళెం రక్షిత మంచినీటి పథకానికి 80వేలు, సాతానువారి పాళెం పైపులైను పొడిగింపుకు లక్షరూపాయలు వెచ్చిస్తారు. విశ్వనాథరావుపేట, దామరమడుగు, రామచంద్రారెడ్డి నగర్‌లకు పైపు లైను పొడిగింపుకు లక్షా పదివేలు, అల్లూరు వెల్లిచర్ల హరిజనవాడలో నీటి తొట్టి నిర్మాణానికి 50వేలు, సారా వుద్యమ పుట్టినిల్లైన దూబగుంట గ్రామంలో 10వేలు ఖర్చు చేస్తారు. కేటాయించిన మొత్తంతో 27 మంచినీటి పథకాలు బాగుపడతాయి. 14 మండలాల్లో ఈ మొత్తాన్ని వినియోగిస్తున్నట్లు కలెక్టర్ వివరించారు.


పల్నాటి పౌరుషం చిత్రంలో చరణ్‌రాజ్, కృష్ణంరాజు

# మంచి చిత్రానికి కొలమానం ఏమిటి?

మంచి సినిమాకు 15 లక్షలిస్తామని మన ముఖ్యమంత్రి ఏ శుభ ఘడియలో ప్రకటించారో గాని, ఇటీవల దాదాపు ప్రతి నిర్మాతా ''ప్రభుత్వం దృష్టిలో మాది మంచి చిత్రమని పించుకుంటుంది. మంచి చిత్రానికి భాష్యం చెప్పే చిత్రం మాది,'' వంటి స్టేట్ మెంట్లు విశరుపు పెట్టేస్తున్నారు. ఇంతకీ ప్రభుత్వం 'మంచి చిత్రానికి' గైడ్ లైన్స్ ఏమిటో, నిర్ణేతల కమిటీలో ఎవరెవరు ఉంటారో ఇంకా నిర్ణయించలేదు. నిర్మాతలు మాత్రం ప్రకటనలు దంచేస్తున్నారు. ప్రభుత్వం ఇచ్చే 15 లక్షలు 'లాభం' అనుకొని కొందరు చిత్ర నిర్మాణానికి ఉపక్రమించారు. ఒక వేళ అయిదు లక్షలు నష్టం వచ్చినా ప్రభుత్వం ధర్మమా అని పదిలక్షల ఆదాయం ఉండనే వుంటుంది. అలాగే 10 లక్షలు నష్టం వస్తే అయిదు లక్షల మిగులు వుంటుంది. అందుకే విదేశాలకు కప్పుకాళ్ళు ఎగుమతి చేసే ఒకాయన ''మంచి సినిమా తీయడానికే నేను చిత్ర రంగంలో ప్రవేశిస్తున్నాను,'' అన్నాడు. తమాషా ఏమిటంటే నంది అవార్డుల బహూకరణ సమయంలో ముఖ్యమంత్రి ప్రకటించిన రాయితీలూ, పన్ను విధానం చిత్ర పరిశ్రమకు ప్రోత్సాహకరంగా ఉన్నాయని, ఎంతో మేలు చేస్తాయని అభినందించిన కొందరు నిర్మాతలే జూలై 5న వలన చిత్ర మండలి ప్రకటించిన 'చిత్ర పరిశ్రమ బంద్ 'లో పాల్గొనడం విశేషం!

## శోభన్, రాజేంద్రప్రసాద్‌ల చిత్రం

శోభన్‌బాబు, రాజేంద్రప్రసాద్ కలిసి నటించబోయే ''హలో గురూ!'' చిత్రానికి ... జరుగుతోంది. ఇది వినోదాత్మక చిత్రం. స్క్రిప్టు పూర్తయ్యాక దర్శకుడు నిర్ణయింప బడతాడు.

# రామగోపాలవర్మ శపథం ఏమైంది!

ఇప్పుడున్న సెన్సార్ నభ్యులు మారే వరకు తెలుగు చిత్రాలకు దర్శకత్వం వహించనని శపథం పూనిన రాంగోపాల్ వర్మ'' గాయం'' ఆధారంగా హిందీలో తయారయ్యే ''నాయక్'' చిత్రాన్ని డైరెక్ట్ చేస్తున్నారు. ఇందులో సంజయ్ గత్ హీరో. ఈయన రూపొందించబోయే మరో హిందీ చిత్రంలో జాకీష్రాఫ్ హీరో.

## మందకొడిగా రికార్డింగ్ థియేటర్‌లు

ఎస్.పి.బాల సుబ్రహ్మణ్యం అమెరికా పర్యటన సందర్భంగా మద్రాసులోని చాలా రికార్డింగ్ థియేటర్లలో పనులు మందకొడిగా సాగుతున్నాయి. ప్రతి హీరోకి బాలు పాట తప్పని సరికదా? అమెరికా నుంచి బాలు తిరిగొచ్చాక ఒక్కో రోజు పదెనిమిది పాటలు పాడవలసి వుంటుందేమో. దేనికైనా బాలు కదు సమర్థుడు.

## చిన్న చిత్రమా? పెద్ద చిత్రమా?

నేడు నిర్మాతలను వేధిస్తున్న సమస్య ''చిన్న బడ్జెట్ చిత్రమా? పెద్ద బడ్జెట్ చిత్రమా?'' ''ఎస్.పి.పరశురాం'' నిరాశ కల్గించడంతో 'స్టార్ ఇమేజ్' మీద చాలా మంది దర్శక నిర్మాతలకు నమ్మకం తగ్గుతున్నది.

''యమలీల'' లో కొమ్ములు తిరిగిన వారెవరున్నారని అంత బాగా ఆడుతున్నది? ఈ చిత్రంలో కథ కన్నా కథనందే పై చెయ్యి. నేడు చిన్న చిత్రం తయారవడానికి కూడా నిర్మాణ వ్యయం 75 లక్షలకు తగ్గడం లేదు. కనీసం కోటి రూపాయకైనా అమ్మితే గాని, చిన్న చిత్రం వర్కవుట్ కాని పరిస్థితి ఏర్పడింది. నిర్మాతలకు దిక్కుతోచకుండా వుంది.

## గృహాలు మార్చే గౌతమి

తారలలో గౌతమిలా గృహాలు మార్చిన వారెవరూ ఉండరు. ఈమె మద్రాసులో పాదం మోపినప్పట్నుంచి ఇంత వరకు పది పదిహేను ఇళ్ళు మార్చి వుంటుంది. '' ఈ భవంతి అచ్చిరాలేదు. ఆ భవంతిలో ఏదో వాస్తు దోషం వుంది,'' అని తనకు సినిమా ఛాన్సులు తగ్గినప్పుడల్లా భావిస్తుంటుంది. తాను తెలుగు వనిత అయినా తనకు తెలుగు చిత్రాలలో చక్కని అవకాశాలు రావడం లేదని ఈమె బాధ. ఆ మధ్య సొంత సినిమా తీయాలనుకుంది. అన్ని ఏర్పాట్లు చేసుకున్నది. ప్రారంభోత్సవం నిర్ణయించిన రెండు రోజుల ముందు ఆ ప్రయత్నాన్ని హఠాత్తుగా విరమించుకున్నది. ఈమె ఎప్పుడూ ఏ నిర్ణయానికి కట్టుబడి వుండదు. చంచల స్వభావం ఆమెలో వున్నలోపం.


ముద్రగడ పద్మనాభం ఆమరణ దీక్షకు మద్దతుగా గాంధీ బొమ్మ వద్ద రిలే నిరాహార దీక్ష చేస్తున్న నెల్లూరు బలిజ యువ నాయకులు పసుపులేటి విజయకుమార్, చాట్ల నరసింహా రావు, గుడిపల్లిపాడు బాబు, నార్ల సుబ్బరాయుడు, మోహాన్ ప్రింటర్స్ చందు తదితరులు

# రేణుకాచౌదరిగా విజయశాంతి!

మన దర్శక నిర్మాతలకు ఒక్కొసారి భలే ఐడియాలు వస్తుంటాయి. ఒక చిత్రంలో విజయశాంతి హేర్ స్టయిల్‌ను మార్చి, రేణుగా చౌదరిలా చూపించనున్నారట. ఆ చిత్రంలో విజయశాంతిది డైనమిక్ కేరెక్టర్. ఈ విషయం బయటకు ఏమాత్రం పొక్కనీయకుండా ఆ చిత్ర నిర్మాత చాలా జాగ్రత్త పడ్డా- రేపు చిత్రం విడుదలయ్యాక ప్రేక్షకులు పోల్చుకోకుండా ఉంటారా? అంత వరకు రహస్యంగా ఉంచడానికి ఎందుకు భయం? విజయశాంతి ఉంటే చాలు, ఇతర భాషల్లోకి చిత్రాన్ని డబ్ చేయడం మూలంగా బోనస్‌గా ఎంతో డబ్బు వస్తుందని నిర్మాతల నమ్మకం. కాని ఆమె ఇమేజ్‌కి అనుగుణంగా కథలు తయారు చేయడం వల్ల కొన్ని చిత్రాల్లో ఆమె పాత్ర స్వభావాలు ఇంచు మించు ఒకే విధంగా



# హాయిగా నవ్వుకోవచ్చు: దొంగరాస్కెల్

**చిత్రసమీక్ష**
**గ్రిద్దలూరు గోపాలరావు**

ప్రేక్షకులను కడుపుబ్బా నవ్వించే హాస్య చిత్రాలు ఇటీవలి కాలంలో అప్పుడప్పుడూ వస్తున్నాయి. ఈవిధంగా హాస్యాన్ని అందించి నవ్వించే చిత్రమే అనిల్ కుమార్ దర్శకత్వంలో భరద్వాజ నిర్మించిన '' దొంగరాస్కెల్''. ఏ కోణం నుంచి చూచినా ఈ చిత్రంలో హాస్యం అంతర్లీనంగా కనిపిస్తున్నది.

భూపతి రాజా వ్రాసిన కథా వస్తువు హాస్యానికి అనువుగా అమరింది. ఇందులోని ప్రతి పాత్ర హాస్యం అందించే విధంగా కుదిరింది. దర్శకుడు అనిల్ కుమార్ కథా వస్తువును, పాత్రలను తన శక్తి యుక్తులను సక్రమ పద్ధతిలో వాడి హాస్యరసభరితంగా మలచి ప్రేక్షకులను ఆరోగ్య కరమైన రీతిలో ఆనంద పరిచాడు. హాస్యసృష్టి కోసం కొంత మంది దర్శకులు అసభ్యతను ఆశ్రయిస్తుంటారు. కాని అనిల్‌కుమార్ అందుకు భిన్నంగా ప్రవర్తించి అశ్లీలతను దూరంగా వుంచాడు. హాస్యం కోసం అక్కడక్కడా కొన్ని అవాస్తవికతలు చిత్రంలో చోటు చేసుకున్నాయి. అవి హాస్య దృష్టికి బాగా ఉపయోగించాయే కాని వాటి వల్ల చిత్రం హాయికి ఆహ్లాదానికి ఎటువంటి ప్రమాదమూ కలుగలేదు.

దొంగలకు, పోలీసులకు నిజ జీవితంలో అవినాభావ సంబంధా లుంటాయి. ప్రబల విరోధాలూ వుంటాయి. కక్ష సాధింపులూ వుంటాయి. ఈ చిత్రం ఒక దొంగల కుటుంబాన్ని, ఒక పోలీస్ కుటుంబాన్ని ఆధారం చేసుకుని సాగుతుంది. 'దొంగరాస్కెల్' గా పేరుగాంచిన శ్రీకాంత్ (శ్రీకాంత్) కుటుంబంలో తండ్రీ కొడుకులు, అత్తాకోడళ్ళు, అన్నదమ్ములు అందరూ దొంగలే. ఇక చక్రవర్తి అనే పోలీస్ అధికారి(పిఎల్ నారాయణ) తన ఇల్లే పోలీస్ స్టేషన్‌గా. తన కుటుంబమే పోలీస్

కొరవ 8వ పేజీలో

అరు పదులు నిండిన మా అన్న 'వెంకట్రామన్న'
నిండు నూరేళ్లు నవ్వుతూ తిరగాలి మా వెన్నంటి
ప్రకాశం జిల్లా కరేడులో పుట్టినా, మద్రాసులో వుంటున్నా
ఒంగోలు, నెల్లూరు జిల్లాలు రెండింటిలోనూ
నిత్య సాన్నిహిత్యం, అపార స్నేహ పరివారం కల్గిన మిత్రుడు
మాకెంతో అప్తుడు, మా అందరి హితుడు, ప్రేమాస్పదుడు

# స్వర్ణ వెంకట్రామరెడ్డి, ఎం.ఎ., బి.ఎల్.,

## షష్ట్యబ్దిపూర్తి 14 జూలై 1994 సందర్భంగా

# మా హార్దిక స్నేహ సుమాంజలులు



కె. చంద్రశేఖర్ రెడ్డి
(కె.వి.ఆర్. చంద్రయ్య)

కె. చంద్రశేఖర్
ఇన్‌కంటాక్స్ డిపార్ట్‌మెంట్

సి. ప్రభాకర్ రెడ్డి
విష్ణు హ్యాచరీస్

అన్నం శేషయ్య

పి. మోహన్ కుమార్,
M.Sc., B.Ed.,

కె. తిరుపతి నాయుడు
Ex. ఎ.డి.బి. ఛైర్మన్, అల్లూరు

డి. వెంకట రమణయ్య, M.Sc., M.Phil.,
(Konica) Images, the photo land

యనమల కృష్ణయ్య
చాముండేశ్వరి ఫీడ్స్

పచ్చ శేషయ్య నాయుడు
మేనేజింగ్ పార్ట్‌నర్, వెన్నెల ఐస్‌క్రీమ్స్

సి.వి. కృష్ణారెడ్డి
బస్ ఓనర్ - నెల్లూరు

వి. విజయసారథి, M.E.O.,
కోట

శ్రీమతి కుసుమ, M.Com.,
లెక్చరర్, కె.ఎ.సి. కాలేజి

గండవరం శ్రీనివాసులు రెడ్డి
పారిశ్రామికవేత్త, హైదరాబాదు

ఎస్. వేణుగోపాల్
ఫారెస్ట్ రేంజర్, పొదిలి

పుట్టా గోపాల్ రెడ్డి
నెల్లూరు మునిసిపాలిటీ

తూపిలి వనమాలి
జమీన్‌రైతు, నెల్లూరు.

నాతా కృష్ణమూర్తి
కళ్యాణి ఫైనాన్స్

డా. అమరా పరంధామ,
M.Sc., M.Ed., DDE, Ph.D

డా. పి. కృపానిధి

జి. వీరాభద్రాచారి
జ్యూయిలర్స్

ఎమ్. లీలామోహన్, B.A., B.L.,
అడ్వకేట్, నెల్లూరు.

డా. వి. దశరథరామిరెడ్డి,
U.S.A.,

లతీఫ్, M.A.,
Kutty College of Competition

ఎ.వి. సుబ్బరాయుడు
లెక్చరర్, వి.ఆర్.సి., నెల్లూరు.

కె. ప్రభాకర రెడ్డి
(Botswana - Africa)
ఛార్టెర్డ్ అకౌంటెంట్

కె. సుధాకర్
ఛార్టెర్డ్ అకౌంటెంట్

దంపతి రావు
ప్రిన్సిపల్, M.R.R. College ఉలవపాళ్ళ

సామంతుల నరసింహారెడ్డి
బింగినపల్లి

కె. ఆదెన్న, B.A., B.L.,
Ex. ఎం.ఎల్.ఎ. - సంతనూతలపాడు

వి. వెంకురెడ్డి, M.A.,
లెక్చరర్, M.R.R. College లింగసముద్రం

ఎల్.వి.సుబ్బారెడ్డి, B.Com.,
సింగరాయకొండ, ప్రకాశం

వి. రామచంద్రారెడ్డి
జిల్లాపరిషత్, నెల్లూరు.

చింతం కోటిరెడ్డి
ఉలవపాడు

డా. డి. కృష్ణారావు
సి.ఎస్.శర్మ కాలేజి, ఒంగోలు

పాలిశెట్టి కోటిలింగం
టీచర్, కరేడు

ఎస్. భాస్కర్ రెడ్డి
M.R.R. College ఉలవపాళ్ళ

కె. లక్ష్మణరావు, Bv.Sc.,
వెటర్నరీ డాక్టర్, బాపట్ల

గంటా నారాయణ
హరిజనవాడ - కనుపర్తిపాడు

సి. శ్రీనివాసులు రెడ్డి, నారపరెడ్డి
ఓ. వెంకటేశ్వర్లు, కొండారెడ్డి
మాగుంట రాఘవరెడ్డి ఎడ్యుకేషనల్ ట్రస్టు ఆఫీసు - ఒంగోలు

జగన్నాటి సుబ్బయ్య
హరిజనవాడ - అలగానిపాడు

సి. నర్సిరెడ్డి, M.A., B.Ed.,
రిటైర్డ్ డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్

కె. సుబ్బారెడ్డి
రిసెప్షన్ ఆఫీసర్ (Retd), T.T.D., Tirupathi

దేవిరెడ్డి అనిల్‌కుమార్ రెడ్డి
నెల్లూరు.

వేమిరెడ్డి కోటారెడ్డి,
కంట్రాక్టరు, రామ్మూర్తినగర్, నెల్లూరు.

టి. వెంకారెడ్డి, I.A.S.,
ఓ.ఎస్.డి., సి.ఎమ్. సెక్రటేరియట్

బి. కొండారెడ్డి
డైరెక్టర్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్

కె. సీతారామిరెడ్డి
అసిస్టెంట్ ఎమ్.వి.ఐ. గుంటూరు

కామ్రేడ్ పమిడి కోటయ్య
C.P.M. - Ongole

కె. విజయరామరావు, I.P.S.,
డైరెక్టర్, సిబిఐ, న్యూ ఢిల్లీ

ఎస్. సూర్యప్రకాశరావు I.A.S.
ఆం.ప్ర. ప్రభుత్వ ప్రిన్సిపల్ సెక్రటరీ

ఎల్. రామలింగారెడ్డి, B.E.,
కాంట్రాక్టర్, హైదరాబాదు

టి. మల్లికార్జునరెడ్డి, M.Sc.
న్యూయార్క్, U.S.A.

వళ్ళియప్పన్,
I.A.S., (Madras)

కె. బాపినీడు, M.A.,
డిప్యూటీ డైరెక్టర్ ఆఫ్ ఎంప్లాయిమెంట్ అండ్ ట్రైనింగ్

సి. జానకిరామ్, M.A.,
Ex. ప్రిన్సిపల్, వి.ఆర్.సి. నెల్లూరు.

ఎస్. వరదారెడ్డి (రెడ్డి&రెడ్డి)
హైదరాబాదు

కె. సుబ్రహ్మణ్యం, M.A., Ph.D
కమీషనర్ ఫార్ హయ్యర్ ఎడ్యుకేషన్

కె.ఎస్.ఎల్. గణపతిశర్మ
ఇన్‌కంటాక్స్ ఆఫీసర్, ఒంగోలు

డా. ఉప్పలపాటి ప్రసాద్, M.S.,
ప్రసాద్ నర్సింగ్ హోం - ఒంగోలు

జి. సాయిబాబారెడ్డి
M.D., కోరమండల్ ఆక్వా,

డా. వేమారెడ్డి సురేష్ రెడ్డి
నెల్లూరు

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,